


# రెండవ పంచవర్ష ప్రణాళిక

## పశ్చిమ గోదావరి జిల్లా

**1959-60**

ప్రణాళిక, స్థానిక పరిపాలన శాఖ
ఆంధ్రప్రదేశ్

# విషయ సూచిక


| వరుస సంఖ్య | వివరాలు | | పేజీ సంఖ్య |
|---|---|---|---|
| | మనవి మాట | | (ముందు పేజీ) |
| | **మొదటి భాగం** | | |
| 1. | సాధారణ విషయాలు | ... | 1 |
| 2. | రెండవ ప్రణాళికలోని నాలుగవ సంవత్సరపు కార్యక్రమ స్వరూపం | .... | 12 |
| | **రెండవభాగం** | | |
| | **అభివృద్ధి కార్యక్రమాలు:** | | |
| 1. | వ్యవసాయోత్పత్తి | .... | 26 |
| 2. | చిన్నతరహా నీటిపారుదల పనులు | .... | 42 |
| 3. | భూమి అభివృద్ధి | .... | 45 |
| 4. | పశు గణాభివృద్ధి | .... | 46 |
| 5. | అడవులు | .... | 50 |
| 6. | మత్స్య పరిశ్రమ | ... | 51 |
| 7. | సహకారం, గిడ్డంగులు, మార్కెట్లు | .... | 53 |
| 8. | జాతీయవిస్తరణ సేవా కేంద్రాలు, సామాజికాభివృద్ధి కేంద్రాలు | ... | 62 |
| 9. | పంచాయితీలను పటిష్ఠం చేయడం | .... | 63 |
| 10 | విద్యుచ్ఛక్తి | .... | 64 |
| 11 | గ్రామీణ పరిశ్రమలు చిన్నతరహా పరిశ్రమలు | .... | 66 |
| 12. | చేనేత పరిశ్రమ | .... | 73 |
| 13. | రోడ్లు | .... | 78 |

| | | | |
|---|---|---|---|
| 14. | విద్య | .... | 80 |
| 15. | వైద్యం | .... | 88 |
| 16. | ప్రజారోగ్యం | .... | 94 |
| 17. | గ్రామీణ, పట్టణ నీటి సరఫరా | .... | 95 |
| 18. | గృహ నిర్మాణం | .... | 96 |
| 19. | కార్మికులు—కార్మిక సంక్షేమం | .... | 97 |
| 20. | వెనుకబడిన తరగతులు, షెడ్యూల్డు కులాల సంక్షేమం | .... | 99 |
| 21. | షెడ్యూల్డు తెగల సంక్షేమం | .... | 105 |
| 22. | స్త్రీ సంక్షేమం | .... | 111 |
| 23. | సాంఘిక సంక్షేమం | .... | 112 |
| 24. | మునిసిపల్ రోడ్లు, అభివృద్ధి పనులు | .... | 113 |
| 25. | రేడియో ప్రసారం | .... | 114 |
| 26. | ప్రచారం | .... | 115 |
| 27. | అర్థగణాంక శాఖ | .... | 116 |
| 28. | తంతి, తపాలా సౌకర్యాలు | .... | 116 |
| 29. | రైలు మార్గాలు | .... | 116 |
| 30. | జిల్లా ప్రణాళిక, అభివృద్ధి సంఘం సభ్యుల జాబితా | .... | 117 |

# మనవి మాట

రాజ్యప్రణాళికలోని జిల్లాలవారీ వివరాలు చూపే జిల్లా ప్రణాళికల పరంపరలో 1959-60 సంవత్సరానికి సంబంధించిన ఈ ప్రచురణ నాలుగవది. పుస్తకం మొదటి భాగంలో జిల్లాకు సంబంధించిన సాధారణ గణాంక సమాచారం పొందుపరచబడింది. నేటివరకు సేకరించిన సమాచారం ఇందులో చేర్చబడ్డింది. వానితోపాటు రెండవ పంచవర్ష ప్రణాళిక క్రింద రాజ్య ప్రభుత్వం నాలుగవ సంవత్సరంలో నిర్వహించదలచిన కార్యక్రమాలు కూడా చేర్చబడినాయి. ఇక రెండవ భాగంలో తంతి–తపాలాశాఖ, రైలుమార్గాల అభివృద్ధితోసహా వివిధ అభివృద్ధి కార్యక్రమాలను గురించి వివరించబడింది. ఈ ప్రచురణ జిల్లా పరిషత్తులకు కొంత ఉపయోగకరంగా ఉంటుందనీ దీనిని మెరుగుపరచేందుకు జిల్లాపరిషత్తులు సూచనలు చేయగలవనీ ఆశించబడుతున్నది. ఇంకా సూచనలు ఏమి పంపినా కృతజ్ఞతతో స్వీకరించ బడతాయి. వాటిని హైదరాబాదులో ఉన్న ఆంధ్రప్రదేశ ప్రభుత్వ ప్రణాళికాశాఖ డిప్యూటీ సెక్రెటరీగారికి పంపవచ్చును.

హైదరాబాదు
13–12–59.

సి. నరసింహం
ప్రభుత్వ ప్రణాళిక, స్థానిక పరిపాలన శాఖ
కార్యదర్శి.

# సాధారణ విషయాలు

## విస్తీర్ణం, వర్గీకరణ

ఈ జిల్లా విస్తీర్ణం 2,988 చదరపుమైళ్లు. ఇందులో 3 రెవిన్యూ డివిజన్లు, 8 తాలూకాలు ఉన్నాయి. 1956–57 సంవత్సరంలో ఈ జిల్లాలోని భూమి క్రింది విధంగా వర్గీకరించబడింది.

| | విస్తీర్ణం ఎకరాలలో | మొత్తం విస్తీర్ణం లో శాతం |
|---|---|---|
| మొత్తం భూమి విస్తీర్ణం | 19,31,830 | — |
| అడవులుండే ప్రదేశం | 1,97,215 | 10.3 |
| బీడుభూమి, సాగుక్రిందకు రానిభూమి | 1,58,407 | 8.2 |
| వ్యవసాయేతర కార్యాలకు ఉపయోగించబడుతున్న భూమి | 1,67,731 | 8.7 |
| సాగుకు లాయకీ అయిన బంజరు | 1,77,953 | 9.2 |
| శాశ్వత పచ్చిక బీళ్లు, ఇతర పచ్చిక బయళ్ళు | 67,323 | 3.5 |
| సాగుచేయబడే నికరపు విస్తీర్ణంలో చేర్చబడని నానా రకాల చెట్లు, తోటలు, పంటలు ఉండే భూమి | 18,381 | 0.9 |
| ప్రస్తుత బంజర్లు | 96,881 | 5.0 |
| ఇతర బంజర్లు | 56,386 | 2.9 |
| మొత్తం సాగు చేయబడే భూమి | 9,91,583 | 51.3 |
| ఒకసారికి మించిసాగు చేయబడేభూమి | 2,34,768 | 12.2 |
| మొత్తం పంట భూమి | 12,26,271 | 63.5 |

## వేర్వేరు ఋతు పవనాలవల్ల మొత్తం వర్షపాతం
(అంగుళాలలో)

| | 1956–57 | 1955–56 | మామూలు. |
|---|---|---|---|
| నైఋతి ఋతుపవనాలు | 31.1 | 27.2 | 27 |
| ఈశాన్య ఋతుపవనాలు | 15.2 | 14.1 | 10.2 |
| శీతాకాలం | — | 0.1 | 0.6 |
| వేసవికాలం | 1.5 | 5.1 | 2.9 |
| మొత్తం | 47.8 | 46.5 | 40.7 |

## నీటిపారుదల—నీటివనర్లు

నీటి పారుదల గోదావరి కృష్ణానదుల డెల్టా కాలువలద్వారానే ముఖ్యంగా జరపబడుతున్నది. ఎగువ ప్రాంతాలలో ఎక్కువగా వర్షాధారపు చెరువులు, కొన్ని వాగులవల్ల నింపబడుతున్న చెరువులే నీటివనరులు. కొన్ని సమయాల్లో రైతులే వాగుల నుండి నీరు తోడి పోసుకోవడం జరుగుతున్నది. ఎగువ ప్రాంతాలలో తోటలకు నీటిపారుదల సౌకర్యం కలిగించటంకోసం ప్రయివేటుబావులు ఉన్నాయి. సముద్ర ప్రాంత గ్రామాలలో మెట్ట పంటలకు తాత్కాలిక దొరువు బావులే జలాధారం. 1956–57వ సంవత్సరంలో ఈ జిల్లాలోని నీటి వనర్లు, వాటివల్ల సాగుచేయబడిన విస్తీర్ణం వివరాలు దిగువ తెలుపబడినాయి.

## నీటి వనర్లు

1. ప్రభుత్వ కాలువలు, 171

2. ప్రయివేటు కాలువలు

3. బావులు

(ఎ) గొట్టపు బావులు 80

(బి) నీటిపారుదలకు మాత్రం ఉపయోగించబడే ఇతర బావులు —

(i) ప్రభుత్వం వారివి

(ఎ) రాతి కట్టడం గలవి 532

(బి) రాతికట్టడం లేనివి 96

(ii) ప్రయివేటువి

(ఎ) రాతికట్టడం గలవి 5,583

(బి) రాతికట్టడం లేనివి 35

4. గృహకార్యాలకు మాత్రం ఉపయోగించబడే బావుల సంఖ్య 2,967

5. ఉపయోగంలో లేని బావుల సంఖ్య 20

6. రిజర్వాయర్లు

7. చెరువులు

(ఎ) నూరు ఎకరాలు అంతకన్న ఎక్కువఆయకట్టుగలవి 189

(బి) నూరు ఎకరాలకన్న తక్కువ ఆయకట్టుగలవి 589

నీటిపారుదల జరుగుచున్న భూమి విస్తీర్ణం

1. ప్రభుత్వ కాలువల ద్వారా 6,05,364

2. ప్రయివేటు కాలువల ద్వారా

3. చెరువుల ద్వారా 1,30,317

4. బావుల ద్వారా

(ఎ) కేవలం నీటి పారుదలకు ఉపయోగించబడేవి 8,924

(బి) ఇతర నీటి పారుదల వనరులకు తోడ్పడేవి —

(సి) ఇతర వనరులు (ఊటకాలువలు మొదలయినవి) 31,086

5. నీటిపారుదల జరుగుచున్న మొత్తం భూమి 7,65,691

6. పంటపండే నికరపు భూమిలో నీటి పారుదల జరిగే భూమి శాతం 77.2

7. ఒకే సంవత్సరములో ఒక సారికంటె ఎక్కువగా నీటి పారుదల జరిగే విస్తీర్ణం 1,36,999

8. నీటి పారుదలవల్ల పంటలు పండే మొత ం భూమి 9,02,690

9. మొత్తం పంటపండే భూమిలో నీటిపారుదల జరిగే విస్తీర్ణం యొక్క శాతం 78.6

10. స్వంత ఆయకట్టుండే బావులు 878

11. గుర్తింపబడిన నీటి పారుదల వనరులకు తోడ్పడే బావులు —

12. నీటి పారుదల జరిగే మొత్తం నికరపు విస్తీర్ణంలో స్వంత ఆయకట్టుండే బావులద్వారా నీటి పారుదల జరిగే విస్తీర్ణం యొక్క శాతం —

13. ఆయిలు ఇంజన్ల సంఖ్య 55

## పంటలు

ఈ జిల్లాలో వరి ముఖ్యాహార పంట. జొన్న, కుంబు, మొక్కజొన్న, రాగి, కొర్ర, వరగు, సమైకూడా కొద్దిగాపండించబడుతున్నాయి. మిరప, చెరకు,

వేరుశెనగ, నువ్వులు, పొగాకు ఈ జిల్లాలో వ్యాపారపు పంటలు. చింతలపూడి తాలూకాలోను, నరసాపురం తాలూకా పాలకొల్లులోను ముఖ్యంగా బత్తాయి నారింజ తోటలు ఉన్నాయి. డెల్టా ప్రాంతాలలో, అందును ముఖ్యంగా తణుకు, నరసాపురం తాలూకాలలో కొబ్బరి తోటలు విస్తారంగా కనిపిస్తాయి.

1956–57లో సాగుచేయబడిన విస్తీర్ణాన్ని, పండిన పంటల్ని తెలిపే వివరణ దిగువ తెలుపబడింది.

| పంటలు | విస్తీర్ణం ఎకరాలలో | మొత్తం పంట (టన్నులలో) |
|---|---|---|
| I తృణధాన్యాలు | | |
| 1. వరి | 8,32,489 | 4,13,050 |
| 2. గోధుమలు | — | — |
| 3. జొన్న | 52,701 | 13,940 |
| 4. సజ్జ | 8,430 | 2,040 |
| 5. బార్లి | — | — |
| 6. మొక్కజొన్న | 1,709 | 690 |
| 7. రాగి | 3,485 | 1,560 |
| 8. కొఱ్ఱ | 629 | 180 |
| 9. వరగు | 1,844 | 590 |
| 10. సమాయి | 2,460 | 530 |
| 11. ఇతర తృణధాన్యాలు | 474 | 100 |
| మొత్తం తృణధాన్యాలు | 9,04,221 | 4,32,680 |
| II. పప్పు ధాన్యాలు | | |
| 1. శనగలు | 1,959 | 330 |
| 2. పెసలు | 1,932 | 210 |

| | | | |
|---|---|---|---|
| 3. | కందులు | 5,723 | 970 |
| 4. | మినుములు | 2,205 | 250 |
| 5. | ఉలవలు | 70,356 | 5,020 |
| 6. | ఇతర పప్పు ధాన్యాలు | 3,126 | 240 |
| | మొత్తం పప్పు ధాన్యాలు | 85,301 | 7,070 |

III. సంబారాలు

| | | | |
|---|---|---|---|
| 1. | పోకచెక్కలు | 47 | — |
| 2. | మిరపకాయలు | 14,098 | 4,250 |
| 3. | అల్లం | — | — |
| 4. | పసుపు | 4,481 | — |
| 5. | వెల్లుల్లి | 295 | — |
| 6. | ధనియాలు | 4,178 | — |
| 7. | చింతపండు | 46 | — |
| 8. | ఇతర సంబారాలు | 522 | — |
| | మొత్తం సంబారాలు | 23,667 | 4,250 |

IV చక్కెర పంటలు

| | | | |
|---|---|---|---|
| 1. | చెరకు | 17,478 | 61,000 |
| 2. | తాటి | 789 | — |
| 3. | ఇతరములు | — | — |
| | మొత్తం చక్కెర పంటలు | 18,267 | 61,000 |

V. పండ్లు, కూరగాయలు

1. (ఎ) తాజా పండ్లు

| | | |
|---|---|---|
| (i) అరటి పండ్లు | 2,812 | — |
| (ii) నిమ్మజాతికి చెందినపండ్లు | 2.046 | — |
| (iii) మామిడి పండ్లు | 17,537 | — |
| (iv) ఇతర తాజాపండ్లు | 4,440 | — |
| మొత్తం తాజాపండ్లు | 26,835 | — |
| (బి) ఎండు పండ్లు | | |
| (i) జీడి గింజలు | 237 | — |
| (ii) ఇతర ఎండు పండ్లు | — | — |
| మొత్తం ఎండు పండ్లు | 237 | — |
| మొత్తం ఎండు పండ్లు, తాజాపండ్లు | 27,072 | — |
| 2. కూరగాయలు | | |
| (ఎ) బంగాళా దుంపలు | — | — |
| (బి) కఱ్ఱ పెండలం | — | — |
| (సి) చిలగడ దుంపలు | 40 | — |
| (డి) ఉల్లిగడ్డలు | 2,444 | 9,270 |
| (ఇ) ఇతర కూరగాయలు | 4,692 | — |
| మొత్తం కూరగాయలు | 7,176 | 9,270 |
| మొత్తం పండ్లు, కూరగాయలు దుంప పంటలతో సహా | 34,248 | — |
| (vi) వివిధ రకాలకు చెందిన ఇతర ఆహార పంటలు | 1,927 | — |
| మొత్తం ఆహార పంటలు | 10,67,681 | — |

## ఆహారేతర పంటలు

| | | |
|---|---|---|
| I నారలు | | |
| 1. ప్రత్తి | — | — |
| 2. బొంబాయి జనుము | 135 | 290 |
| 3. జనుము | 1,819 | — |
| 4. ఇతర నారలు | 169 | — |
| మొత్తం నారలు | 2,123 | 290 |
| II నూనె గింజలు | | |
| (ఎ) ఆహారంలో ఉపయోగించ బడేవి | | |
| (i) వేరు శనగ | 16,142 | 6,540 |
| (ii) కొబ్బరి | 11,621 | — |
| (iii) నువ్వులు | 68,289 | 8,190 |
| (iv) రేప్ విత్తనాలు, ఆవాలు | — | — |
| (v) కుసుమలు | — | — |
| (vi) ఇతరములు | — | — |
| మొత్తం | 96,052 | 14,780 |
| (బి) ఆహారంలో ఉపయోగించబడనివి | | |
| (i) ఎల్లగిసె విత్తనాలు | 6 | — |

| | | |
|---|---|---|
| (ii) ఆముదాలు | 2,346 | 240 |
| (iii) నిగర్ విత్తనాలు | — | — |
| (iv) ఇతరములు | 136 | — |
| మొత్తం ఆహారంలో ఉపయోగించబడని నూనెగింజలు. | 2,448 | 240 |
| మొత్తం నూనెగింజలు | 98,540 | — |
| III అద్దకం రంగులు, తోళ్ళపరికరాలు | | |
| (i) నీలిమందు (అద్దకంకోసం) | 4 | — |
| (ii) ఇతర అద్దకపు రంగులు | — | — |
| మొత్తం అద్దకపు రంగులు | 4 | — |
| IV మందులు, మత్తుపదార్థాలు | | |
| 1. కాఫి | — | — |
| 2. జనుము | — | — |
| 3. తమల పాకులు | — | — |
| 4. పొగాకు | 38,077 | 13,880 (టన్నులు) |
| 5. ఇతర మందులు, మత్తు పదార్థాలు | — | — |
| మొత్తం మందులు, మత్తు పదార్థాలు | 38,077 | 13,880 |

| | | | |
|---|---|---|---|
| V | పశుగ్రాసపు పంటలు | 17,553 | — |
| VI | పచ్చి ఎరువు పంటలు | | |
| | 1. జనుము | — | — |
| | 2. నీలిమందు | — | — |
| | 3. ఇతరములు | 23 | — |
| | మొత్తం పచ్చి ఎరువు పైరులు | 23 | — |
| VII | వివిధ ఆహారేతర పంటలు | 2,315 | — |
| | (i) మొత్తం ఆహారేతర పంటలు | 1,58,640 | — |
| | (ii) మొత్తం పంట భూమి | 12,26,271 | — |
| | (iii) ఒకసారికంటే ఎక్కువగా పండే భూమి | 2,34,768 | — |
| | (iv) నికరపు పంట భూమి | 9,91,503 | — |

## స్థానిక పరిపాలన

ఈ జిల్లాలో ఏలూరు, పాలకొల్లు, భీమవరం, నరసాపురం, తాడేపల్లి గూడెంలలో 5 మునిసిపాలిటీలు ఉన్నాయి.

## తపాలా కార్యాలయాలు

1–4–1959 తేదీ నాటికి యీ జిల్లాలో ఒక హెడ్ ఆఫీసు, 56 సబ్–ఆఫీసులు, 326 బ్రాంచి ఆఫీసులు, 30 టెలిగ్రాఫ్ ఆఫీసులు, 6 టెలిఫోను ఎక్స్ఛేంజిలు, 12 పబ్లిక్ కాల్ ఆఫీసులు ఉన్నాయి.

## రైలు మార్గాలు

ఈ జిల్లాలో 107¾ మైళ్లు బ్రాడుగేజి, 13¼ మైళ్లు మీటరుగేజి రైలు మార్గాలుఉన్నాయి. మద్రాసు నుండి కలకత్తా వెళ్లే బ్రాడుగేజి మార్గం ఏలూరు, తాడేపల్లిగూడెం, కొవ్వూరు తాలూకాలమీదుగా పోతుంది. కొవ్వూరు తాలూకా లోని నిడదవోలు నుండి నరసాపురానికి బ్రాడుగేజి మార్గము ఉన్నది. తణుకు, భీమవరం, నరసాపురం తాలూకాల మీదుగా యిది వేయబడి ఉంది. మీటరుగేజి బ్రాంచి లైను భీమవరం నుండి, కృష్ణా జిల్లాలోని గుడివాడకు, అక్కడ నుండి ఆ జిల్లాలోని విజయవాడకు వేయబడి ఉంది. పోలవరం, చింతలపూడి తాలూకాలు మినహా అన్ని తాలూకాలు రైలు మార్గంలో కలపబడినాయి.

## రోడ్లు

ఈ జిల్లాలో 1,241 మైళ్లరోడ్లు ఉన్నాయి. అవి క్రింది విధంగా వర్గీకరించ బడినాయి, (1–4–59).

| | | మైళ్ళు |
|---|---|---|
| 1. | జాతీయ రహదారులతో సహా రాజ్య రహదారుల శాఖచే నిర్వహించ బడుతున్న రోడ్లు | 571 |
| 2. | మునిసిపాలిటీలచే నిర్వహించ బడుతున్న రోడ్లు | 90 |
| 3. | స్థానిక సంస్థలచే నిర్వహించ బడుతున్న రోడ్లు | 580 |
| | మొత్తం | 1,241 |

## సహకార సంఘాలు

30–6–57 తేదీ నాటికి యీ జిల్లాలో 17 స్టేట్ అండ్ సెంట్రల్ పరపతేతర సంఘాలు, 686 వ్యవసాయ సహకార సంఘాలు, 136 వ్యవసాయేతర సహకార సంఘాలు ఉన్నాయి. వీటిలో సభ్యుల సంఖ్య వరుసగా 1,668; 17,521; మరియు 24,500.

## విద్య

1956–57లో యీ జిల్లాలోని విద్యా సంస్థల సంఖ్య క్రింద యివ్వబడింది.

| | | |
|---|---|---|
| 1. | ఉన్నత పాఠశాలలు | 63 |
| 2. | మాధ్యమిక పాఠశాలలు | 11 |
| 3. | ప్రాథమిక పాఠశాలలు | 1,856 |
| 4. | వయోజన విద్యా కేంద్రాలు | 64 |
| 5. | ప్రత్యేక పాఠశాలలు, వృత్తి విద్యాపాఠశాలలు | 30 |
| 6. | కళాశాలలు (వృత్తి విద్యా కళాశాలలతో సహా | 4 |
| | మొత్తం | 2,028 |

## వైద్యం, ఆసుపత్రులు

1956–57 సం.లో యీ జిల్లాలో 9 జనరలు ఆసుపత్రులు, ?? వైద్యశాలలు ఉన్నాయి.

# రెండవ ప్రణాళికలోని నాలుగవ సంవత్సరపు కార్యక్రమ స్వరూపం

ప్లానింగు కమిషను ఉద్యోగులతోను, కేంద్రమంత్రాంగ శాఖల ఉద్యోగులతోను రాజ్య ప్రముఖోద్యోగులు సంప్రదింపులు జరిపిన తరువాత రెండవ ప్రణాళిక యొక్క నాలుగవ సంవత్సరపు కార్యక్రమం క్రింద రు. 37.66 కోట్ల

మొత్తాన్ని ఖర్చుపెట్టడానికి నిర్ణయించ బడింది. అయితే వివిధ విషయాలను పరిశీలించిన తరువాతను, ప్రణాళిక, అభివృద్ధి కార్యక్రమాలకుసంబంధించిన రాజ్య సలహా సంఘంలో యీ విషయాలనుగురించి సమగ్ర చర్చలు జరిపిన అనంతరం రాజ్య ప్రభుత్వం వారు ఈ సంవత్సరంఖర్చు పెట్టదలచిన మొత్తాన్ని రు. 42.03 కోట్లకు పెంచడానికి నిర్ణయించారు. ఈవిధంగా కేటాయింపు మొత్తాన్ని హెచ్చిం చడానికి ముఖ్యకారణాలు ఏవంటే:

(i) ఈ సంవత్సరం కేటాయింపు మొత్తాన్ని హెచ్చుచేయక పోయి నట్లయితే రెండవ ప్రణాళిక యొక్క ఆఖరి సంవత్సరంలో చేయవలసిన పనులు ఎక్కువగా మిగిలి పోతాయి.

(ii) పెంచబడిన కేటాయింపు మొత్తాన్ని ఖర్చు పెట్టటానికి తగిన విధంగా రాజ్య పరిపాలనా యంత్రాంగం సంసిద్ధం చేయబడింది.

(iii) ప్రస్తుతమున్న ఆదాయ మార్గాలను పూర్తిగా వినియోగించుకో వలసిన అవసరం ఎంతైనా ఉన్నది.

(iv) రాజ్య ప్రభుత్వం యొక్క ఆదాయ మార్గాలు కూడ ఈ పాటి ప్రణాళికను అమలు పరచటానికి తగినంతగా ఉన్నాయి

ప్రతి అభివృద్ధి కార్యక్రమం క్రిందా ఎక్కువ చేయబడిన కేటాయింపు వివరాల్ని మొదటి పట్టికలో చూడవచ్చును.

ఈ సంవత్సరం ఖర్చు పెట్టదలచినమొత్తం యిది వరకటి సంవత్సరాల కంటే చాల ఎక్కువ. గత సంవత్సరం మొదట నిర్ణయించి తరువాత సవరించ బడిన మొత్తాలకంటే యిది వరుసగా రు. 12 మరియు 7 కోట్లు ఎక్కువ. ప్రణా ళిక యొక్క మొదటి నాలుగు సంవత్సరాల్లోను కేటాయించబడిన మొత్తం వివ రాలు రెండవ పట్టికలో చూడవచ్చును.

వివిధ విషయాల పద్దు క్రింద యివ్వబడిన కార్యక్రమాల కేటాయింపు విష యంలో చేయబడిన కొద్దిపాటి తగ్గింపు మినహా మిగత అన్ని అభివృద్ధి కార్య

క్రమాల క్రింద కేటాయింపు మొత్తం అధికం చేయబడింది. అయితే 1958-59 సంవత్సరంతో పోల్చిచూస్తే కేటాయింపులో ఎక్కువ భాగం పరిశ్రమలకు, రవాణాకు, సాంఘిక కార్యక్రమాలకు ప్రత్యేకించ బడిన విషయం విదితం కాగలదు. అయినప్పటికీ వివిధ కార్యక్రమాలకు దాదాపు గత సంవత్సరంలో యివ్వబడిన క్రమంలోనే ప్రాధాన్యం యివ్వబడింది.

ఈ సంవత్సరం అమలు పరచడానికి ఉద్దేశింపబడిన పథకాలు, వాటికి కేటాయించ బడిన ధనం, సాధించ దలచిన లక్ష్యాలను గురించి సమగ్రవివరణలు రెండవ భాగంలో చూడవచ్చును.

ఈ సంవత్సరపు కార్యక్రమాన్ని గురించి సంగ్రహంగా తెలపటం కోసం 1959-60లో సాధించ దలచిన లక్ష్యాలను గురించిన వివరాలు క్రింద యివ్వబడినాయి.

## కొన్ని లక్ష్యాల వివరాలు

| పద్దు | యూనిట్లు | 1959-60 సంవత్సరపు లక్ష్యాలు |
|---|---|---|
| వ్యవసాయం | | |
| 1. ఆహార ధాన్యాల ఉత్పత్తి | 000 టన్నులు | |
| (i) పెద్ద తరహా నీటి పారుదల పనులు | ,, | 190.60 |
| (ii) చిన్న తరహా నీటి పారుదల పనులు | ,, | 88.70 |
| (iii) భూమి అభివృద్ధి | ,, | 44.50 |
| (iv) ఎరువులు, రసాయనిక ఎరువులు | ,, | 48.00 |

| | | | |
|---|---|---|---|
| (v) | మేలురకం విత్తనాలు | ,, | 21.00 |
| (vi) | సస్యరక్షణ | ,, | — |
| (vii) | పై పద్ధుల క్రింద ఉత్పత్తికి వీలు కల్పించ బడిన తరువాత మేలురకం వ్యవసాయ విధానాలు అవలంబించటానికి | ,, | 89.60 |
| | | | 427.40 |
| | ఆహారేతర పంటలవల్ల తగ్గింపు | ,, | 11.30 |
| | | | 416.10 |

| | | 000 | |
|---|---|---|---|
| | చిన్న తరహా నీటి పారుదల పనులు | ఎకరాలు | |
| | నీటి పారుదల కల్పించబడుతున్న భూమి | — | వివరాలు అందు బాటులో లేవు |
| | విత్తనాల క్షేత్రాలు | సం. | 188 |
| (i) | భూమి స్వాధీనం చేసుకోబడినట్టి వాటి సంఖ్య | — | — |
| (ii) | వ్యవసాయ కార్య కలాపాలు ప్రారంభించ బడినట్టి వాటి సంఖ్య | — | — |
| (iii) | విత్తనాల ఉత్పత్తి ప్రారంభమయిన వాటి సంఖ్య | — | — |

ఎరువులు

| | | 000 | |
|---|---|---|---|
| (i) | పట్టణాల్లో గోతి ఎరువు | టన్నులు | 245.16 |
| (ii) | గ్రామాల్లో గోతి ఎరువు | ,, | ప్రతి పంచాయతీ లోను 75 టన్నులు |

| | | |
|---|---|---|
| (iii) పచ్చి ఎరువులు | ,, | 0.40 |
| రసాయనిక ఎరువులు | 000 | |
| (i) అమ్మోనియం సల్ఫేటు | టన్నులు | 148.40 |
| (ii) సూపర్ ఫాస్ఫేటు | ,, | 47.60 |
| (iii) యూరియా | ,, | 19.50 |
| (iv) అమ్మోనియం నైట్రేటు | ,, | 27.50 |
| (v) కాల్షియం అమ్మోనియం నైట్రేటు | ,, | 8.00 |
| రాజ్య ప్రభుత్వంచే భూములలో స్థిరపరచబడేటటువంటి భూములు లేని కుటుంబాలు | సంఖ్య | వివరాలు అందుబాటులో లేవు |
| 2. పశుగణాభివృద్ధి | | |
| కీలక గ్రామ పథకం | | |
| కృత్రిమ గర్భోత్పత్తి కేంద్రాలు | సంఖ్య | 11 |
| కీలక గ్రామ కేంద్రాలు | ,, | 66 |
| 3. సహకారం | | |
| చిన్నతరహా సంఘాలు | | |
| పటిష్ఠం చేయబడేవి | ,, | 1,000 |
| క్రొత్తవి | ,, | 1,000 |
| సహకార వ్యవసాయసంఘాలు | ,, | 12 |

| | | |
|---|---|---|
| సహకార వ్యవసాయసంఘాలు | విస్తీర్ణం ఎకరాలలో | 3,376 |
| సహకార ఏజెన్సీలద్వారా యివ్వ | రూ॥ లక్షలలో | |
| బడే వ్యవసాయ ఋణం | సంవత్సరానికి | |
| స్వల్పకాలిక ఋణాలు | ,, | 1,320 |
| మధ్యకాలిక ఋణాలు | ,, | 130 |
| దీర్ఘకాలిక ఋణాలు | ,, | 171 |
| మార్కెటింగు ఫైనాన్సు | ,, | 450 |

4. సామాజికాభివృద్ధి బ్లాకులు (జాతీయ విస్తరణ సేవా కేంద్రాలతో సహా) సంఖ్య

| | | |
|---|---|---|
| కేంద్రాలతో సహా) సంఖ్య | సంఖ్య | మొదటిదశ బ్లాకులు 26 |
| | | రెండవదశ బ్లాకులు 20 |
| జనాభా | మిలియన్లు | 1,675 |
| ఉపయోగం పొందే గ్రామాలసంఖ్య | సంఖ్య | 1,600 |

5. పెద్దతరహా, మధ్య తరహా నీటిపారుదల పనులు

| | | |
|---|---|---|
| | 000 | |
| సంభవమయ్యే అదనపు నీటి పారుదల | ఎకరాలు | 418 |
| అదనంగా నీటి పారుదల కల్పించబడే భూమి | ,, | 418 |

6. విద్యుచ్ఛక్తి

| | | |
|---|---|---|
| | 000 | |
| అదనపు ఇన్‌స్టాల్డు కెపాసిటి | కిలోవాట్లు | 29,750 |
| 33 కె. వి. కంటె శక్తివంతమైన ట్రాన్సు మిషను లైన్లు | మైళ్లు | 290 |
| 33 కె. వి. అంత కంటె తక్కువ శక్తివంతమైన ట్రాన్సు మిషను లైన్లు | ,, | 400 |
| విద్యుతీకరణ చేయబడే పట్టణాలు, గ్రామాల సంఖ్య | సంఖ్య | 200 |

7. వరద నివారణ

| | | |
|---|---|---|
| | 000 | |
| అదనంగా రక్షణ కల్పించబడే భూమి | ఎకరాలు | 48 |

8. రోడ్లు

| | | |
|---|---|---|
| నిర్మించబడే కంకర రోడ్లు | మైళ్లు | 29.4 |

9. విద్య

| | | |
|---|---|---|
| సంస్థలు | సంఖ్య | |
| ప్రాథమిక పాఠశాలలు, జూనియరు బేసిక్ పాఠశాలలు కలుపుకొని | ,, | 1,600 |
| జూనియరు బేసిక్ పాఠశాలలు | ,, | 419 |
| మాధ్యమిక పాఠశాలలు, సీనియరు బేసిక్ పాఠశాలలు కలుపుకొని | ,, | 32 |
| సీనియరు బేసిక్ పాఠశాలలు | ,, | — |
| ఉన్నతపాఠశాలలు | ,, | 18 |
| హైయ్యర్ సెకండరీ పాఠశాలలు | ,, | 10 |
| బహుళార్థ సాధక పాఠశాలలు | ,, | 4 |
| సాంకేతిక విద్య—డిగ్రీ/డిప్లొమా | ,, | -- |
| వివిధ తరగతుల్లో చేర్చుకోబడే విద్యార్థులు | సంఖ్య | డిప్లొమా 1,1`0 |
| | | డిగ్రీ 360 |
| I నుండి V వ తరగతి వరకు | ,, | 50,000 |
| VI నుండి VIII వ తరగతి వరకు | ,, | 20,910 |
| IX నుండి XI వ తరగతి వరకు | ,, | 6,900 |
| ఉపాధ్యాయులకు శిక్షణ శిక్షణపాఠశాలల్లో (బేసిక్ నాన్ బేసిక్ కలుపుకొని) అల్లో చేర్చుకోబడేవారి సంఖ్య | సంఖ్య | 2,250 |

| | | | | |
|---|---|---|---|---|
| | శిక్షణ కళాశాలల్లో (బేసిక్, నాన్‌బేసిక్ కలుపుకొని) చేర్చుకోబడేవారి సంఖ్య | సంఖ్య | | 200 |
| 10. | ఆరోగ్యం | | | |
| | ఆరోగ్య కేంద్రాలు | | | |
| | సామాజికాభివృద్ధి కార్యక్రమం క్రింద<br>ఇతర కార్యక్రమం క్రింద | ,, | | 20 |
| | కుటుంబ నియంత్రణ కేంద్రాల సంఖ్య | | | |
| | i పట్టణ కేంద్రాలు | ,, | | 15 |
| | ii గ్రామీణ కేంద్రాలు | ,, | | 44 |
| | శిక్షణ సౌకర్యాలు | | | |
| | i డాక్టర్లు | ,, | | 450 |
| | ii నర్సులు | ,, | | 130 |
| | iii దాయీలు | ,, | | 720 |
| | iv సహాయక నర్సు-మంత్రసానులు | ,, | | 90 |
| | v మంత్రసానులు | ,, | | 153 |
| 11. | గృహ నిర్మాణం | | | |
| | పారిశ్రామిక గృహవసతి<br>నిర్మించ బడిన యూనిట్లు | ,, | | 1,365 |
| | తక్కువ ఆదాయం గలవారికి గృహనిర్మాణం | ,, | ఆర్. సి. ఎస్ | 680 |
| | నిర్మించ బడిన యూనిట్లు | ,, | డి. టి. పి. | 180 |
| 12. | కార్మికులు, కార్మిక సంక్షేమం | | | వివరాలు అందు |
| | వృత్తి పనివారికి శిక్షణ | ,, | | బాటులో లేవు |

| | | |
|---|---|---|
| శిక్షణ కేంద్రాలు | ,, | — |
| శిక్షణ యివ్వబడినవారి సంఖ్య | ,, | 1,816 |
| 13. వెనుకబడిన తరగతుల సంక్షేమం | | |
| షెడ్యూల్డు తెగలు | | |
| స్కాలరు షిప్పులు | ,, | 2,465 |
| సహాయం చేయబడిన కుటుంబాలు | ,, | 687 |
| తెరవబడిన వైద్యాలయాలు | ,, | — |
| నిర్మించబడిన రోడ్లు | మైళ్ళు | 73 |
| షెడ్యూల్డు కులాలు | | |
| స్కాలరు షిప్పులు | సంఖ్య | 4,900 |
| సహాయం చేయబడిన కుటుంబాలు | ,, | 850 |
| విముక్త జాతులు | | |
| స్కాలరు షిప్పులు | ,, | — |
| పునరావాసం కల్పించబడిన కుటుంబాలు | ,, | 275 |
| ఇతర వెనుకబడిన తరగతులు | | |
| స్కాలరు షిప్పులు | ,, | 5780 |
| సహాయం చేయబడిన కుటుంబాలు | ,, | — |

## మొదటి పట్టిక

### 1959-60 సంవత్సరపు ప్రణాళికలో కేటాయించబడిన మొత్తం వివరాలు

(రూపాయలు లక్షలలో)

| వరుస సంఖ్య | అభివృద్ధి కార్యక్రమం వివరం | 1959-60లో కేటాయింపు | | | |
|---|---|---|---|---|---|
| | | ఆంధ్ర | తెలంగాణా | ఆంధ్రప్రదేశ్ | మొత్తం ప్రణాళిక కేటాయింపుకు శాతం |
| | వ్యవసాయకార్యక్రమాలు | 687.142 | 373.080 | 1,060.222 | 25.23 |
| 1. | వ్యవసాయోత్పత్తి | 120.710 | 47.180 | 167.890 | 4.00 |
| 2. | చిన్నతరహా నీటిపారుదలపనులు | 105.81 | 69.19 | 175.000 | 4.16 |
| 3. | భూమి అభివృద్ధి | 5.300 | — | 5.300 | 0.13 |
| 4. | పశు గణాభివృద్ధి | 66.062 | 21.470 | 87.532 | 2.08 |
| 5. | పాడిపరిశ్రమ, పాలసరఫరా | 12.550 | 15.940 | 28.490 | 0.68 |
| 6. | అడవులు | 16:520 | 21.720 | 38.240 | 0.91 |
| 7. | భూసారరక్షణ | 13.810 | 6.060 | 19.870 | 0.47 |
| 8. | మత్స్య సంవర్ధన | 15.710 | 7.290 | 23.000 | 0.55 |
| 9. | సహకారం, గిడ్డంగులు, మార్కెటింగు | 81.370 | 58.270 | 139.640 | 3.32 |
| 10. | వివిధ విషయాలు | 3.000 | 1.360 | 4.360 | 0.10 |
| 11. | సామాజికాభివృద్ధి, జాతీయ విస్తరణ సేవా కార్యక్రమాలు | 240.850 | 119.150 | 360.000 | 8.57 |
| 12. | పంచాయతీలను పటిష్ఠంచేయటం | 5.450 | 5.450 | 10.900 | 0.26 |
| | నీటిపారుదల, విద్యుచ్ఛక్తి | 994.960 | 711.090 | 1,706.050 | 40.60 |
| 13. | బహుళార్థ సాధక ప్రాజెక్టులు | 445.000 | 255.000 | 700.000 | 16.66 |

| | | | | |
|---|---|---|---|---|
| 14. పెద్దతరహా, మధ్యతరహా నీటిపారుదల పనులు | 242.470 | 265.220 | 507.690 | 12.08 |
| 15. విద్యుచ్ఛక్తి | 307.490 | 190.870 | 498.360 | 11.86 |
| పరిశ్రమలు | 219.720 | 75.410 | 295.130 | 7.02 |
| 16. పెద్దతరహా, మధ్యతరహా పరిశ్రమలు | 83.850 | — | 83.850 | 1.99 |
| 17. గ్రామీణ పరిశ్రమలు, చిన్నతరహా పరిశ్రమలు | 88.750 | 54.630 | 143.380 | 3.41 |
| 18. చేనేత పరిశ్రమలు | 47.120 | 20.780 | 67.900 | 1.62 |
| రవాణా | 145.920 | 64.430 | 210.350 | 5.01 |
| 19. రోడ్లు | 116.090 | 64.430 | 180.520 | 4.30 |
| 20. రోడ్డు రవాణా | 29.830 | — | 29.830 | 0.71 |
| సాంఘిక కార్యక్రమాలు | 514.980 | 361.826 | 876.806 | 20.86 |
| 21. విద్య | 188 670 | 134.610 | 323.280 | 7.69 |
| 22. వైద్యం | 88.060 | 61.940 | 150.000 | 3.57 |
| 23. ప్రజారోగ్యం | 46.540 | 30.390 | 76.930 | 1.83 |
| 24. గ్రామీణ, పట్టణ నీటిసరఫరా | 16.340 | 33.280 | 49.620 | 1.18 |
| 25. గృహ నిర్మాణం | 46.17 | 66.08 | 112.250 | 2.67 |
| 26. కార్మికులు, కార్మిక సంక్షేమం | 16.510 | 14.050 | 30.560 | 0.73 |
| 27. వెనుకబడిన తరగతుల, షెడ్యూల్డు కులాలసంక్షేమం | 40.920 | 14.350 | 55.270 | 1.32 |
| 28. షెడ్యూల్డు తెగలసంక్షేమం | 48.160 | 5.666 | 53.826 | 1.28 |
| 29. స్త్రీ సంక్షేమం | 4.110 | 1.460 | 5.570 | 0.13 |
| 30. సాంఘిక సంక్షేమం | 19.500 | — | 19.500 | 0.46 |
| వివిధవిషయాలు | 49.250 | 4.710 | 53.960 | 1.28 |
| 31. రాజధాని అభివృద్ధి | 20.000 | — | 20.000 | 0.48 |

| | | | | |
|---|---|---|---|---|
| 32. మునిసిపల్ రోడ్లు అభివృద్ధిపనులు | 11.590 | — | 11.590 | 0.28 |
| 33. రేడియో ప్రసారం | 4.860 | 1.670 | 6.530 | 0 15 |
| 34. ప్రచారం | 3.760 | 3 040 | 6.800 | 0.16 |
| 35. అర్థగణాంకశాఖ | 9.040 | — | 9.040 | 0.21 |
| మొత్తం | 2611.972 | 1519.546 | 4202.518 | 100.00 |

| వరుస సంఖ్య | అభివృద్ధి కార్యక్రమం పేరు | 1956–57లో | |
| --- | --- | --- | --- |
| | | ఆంధ్ర | తెలం |
| 1 | 2 | 3 | 4 |
| 1. | వ్యవసాయ కార్యక్రమాలు | 329.790 | 325. |
| 2. | నీటిపారుదల, విద్యుచ్ఛక్తి | 1143.420 | 498. |
| 3. | పరిశ్రమలు | 107.480 | 55. |
| 4. | రవాణా సౌకర్యాలు | 60.330 | 22. |
| 5. | సాంఘిక కార్యక్రమాలు | 227.960 | 134. |
| 6. | వివిధ విషయాలు | 70.770 | 2. |
| | మొత్తం ... | 1939.750 | 1038. |

* ఇది యీ సంవత్సరం రు. 35 కోట్లకు పెంచబడింది.

# వ్యవసాయోత్పత్తి

## మేలురకం విత్తనాల అభివృద్ధి, పంపకం

## (విత్తనాల క్షేత్రాలు, విత్తనాల స్టోరులు)

వ్యవసాయోత్పత్తిని అధికం చేసే ఉద్దేశంతో భారత ప్రభుత్వం వారి కోరిక మీద, బ్లాకుకు ఒక్కొక్కటి చొప్పున విత్తనాల క్షేత్రాలను నెలకొల్పడానికి, విత్తనాల స్టోరులను నిర్మించడానికి ఒక పథకం ప్రారంభించబడింది. ప్రాథమిక విత్తనాల క్షేత్రాల కోసం రిజిస్టరైన ఉత్పత్తిదారులకు పంపకం చేసేటందుకు భారీ ఎత్తున మూల విత్తనాలను ఉత్పత్తి చేసుకోవడంలో ఈ విత్తనాల క్షేత్రాలు ఉపయోగకరంగా ఉంటాయి. రిజిస్టరైన ఉత్పత్తిదారులు, డిపార్టుమెంటువారి కట్టుదిట్టమైన పర్యవేక్షణ క్రింద తమ పొలాలలో అసలు విత్తనాలను పండిస్తారు. అందులో నూటికి 50 వంతులు ఉత్పత్తిదారులనుండి సేకరింపబడి, రైతులకు పంపకం చేసేటందుకు అనేక విత్తనాల స్టోరుల్లో నిల్వ చేయబడతాయి. ఈ సంవత్సరపు ప్రణాళికలో, ఆంధ్ర ప్రాంతంలో 129 విత్తనాల క్షేత్రాలను అదే సంఖ్యలో విత్తనాల స్టోరులను నెలకొల్పడానికి రూ. 42.29 లక్షల మొత్తం కేటాయించబడింది. అందులో రూ. 3.78 లక్షల మొత్తం 11 విత్తనాల క్షేత్రాలను, 11 విత్తనాల స్టోరులను నెలకొల్పడానికి ఈ జిల్లాకు కేటాయించ బడింది.

## తగ్గింపు ధరలకు విత్తనాల పంపకం

ఈ పథకం క్రింద, మేలురకం వరి, జొన్న, గోధుమ, మొక్కజొన్న, పప్పుధాన్యాల విత్తనాలు రిజిస్టరైన ఉత్పత్తి దారుల నుండి కొనుగోలు చేయబడి తగ్గింపు ధరలకు వ్యవసాయదారులకు పంపిణీ చేయబడతాయి. వరి, గోధుమ, మొక్కజొన్న మొదలగు ఒక్కంటికి రూ. 2 చొప్పునా, జొన్న మొదలగు ఒక్కంటికి రూ. 1 చొప్పునా తగ్గింపు ధరలుంటాయి. ఈ పథకం, తెలంగాణా ప్రాంతంలో 1956–57 లగాయతు అమలు జరుగుతున్నది. ఈ పథకం క్రింద చేకూరే లాభాలను ఆంధ్ర ప్రాంతానికి కూడా విస్తరింప చేయడానికి ఈ సంవత్సరంలో

తలపెట్టబడింది. అందుకోసం 1959–60 ప్రణాళికలో రూ. 7.53 లక్షల మొత్తం కేటాయించబడింది. అందులో రూ. 5.22 లక్షల మొత్తం ఆంధ్ర ప్రాంతంలో విత్తనాల పంపిణీకి, రూ. 2.31 లక్షల మొత్తం తెలంగాణా ప్రాంతంలో పంపిణీకి వినియోగింప బడుతుంది. ఈ పథకంవల్ల కలిగే లాభాలు ఈ జిల్లాలోని రైతులకు కూడా చేకూరుతాయి.

## అక్కుళ్ల జాతి బియ్యం అభివృద్ధి పరచడం

ఇది పరిశోధనపథకం. అక్కుళ్లు ధాన్యం వివిధజాతుల సమిశ్రితమైన రకం. ఇటువంటి రకాన్ని ఉత్పత్తి చేయడానికి, రెండో పంటకు స్వల్పకాలిక వరి జాతిని ఉత్పత్తిచేయడానికి ఈ పథకం ఉద్దేశిస్తున్నది. ఈ పథకం 1956–57లో మార్టేరులో ప్రారంభించబడింది. అటు తర్వాత రెండు సంవత్సరాలు కూడ ఈ పథకం కొనసాగింపబడింది. దీనిని ఇంకా కొనసాగించేటందుకు ఈ సంవత్సరపు ప్రణాళికలో రూ. 0.03 లక్ష మొత్తం కేటాయించబడింది.

## చీడల, తెగుళ్ల నివారణ

పంటలకు చీడలు, తెగుళ్లు పట్టకుండా నివారణ చర్యలు తీసికోవడానికి వ్యవసాయశాఖ డిపోలలోని సాధన సామాగ్రిని పెంపు చేసేటందుకు స్ప్రేయర్లను, డస్టర్లను కొనాలని ఈ పథకం ఉద్దేశిస్తున్నది. ప్రతి జిల్లా హెడ్ క్వార్టర్సులోను నియమించబడిన ప్లాంటు ప్రొటెక్షను అసిస్టెంట్లకు సలహా నిచ్చేటందుకు మైకాలజీ కొకరు, ఎంటిమోలజీకి ఒకరు మొత్తం ఇద్దరు ప్లాంటు ప్రొటెక్షను ఆఫీసర్లు నియమింపబడ్డారు. 1957–58లో మొబైల్ ప్లాంటు ప్రొటెక్షను సర్వీసు కూడా ప్రారంభించ బడింది. ఇందుకు 8 మొబైలు వ్యానులు కూడ సరఫరా చేయబడ్డాయి. ప్రస్తుతం యివి ఆంధ్ర ప్రాంతంలో పని చేస్తున్నాయి. ఈ పథకం క్రింద నియమించబడిన సిబ్బందిని, మొబైలు ప్లాంటు ప్రొటెక్షన్ సర్వీసును కొనసాగించేటందుకు 70 విద్యుచ్ఛక్తి స్ప్రేయర్లను, 500 చేతి డస్టర్లను కొనడానికి రూ. 5.42 లక్షల మొత్తం ఈ సంవత్సరపు ప్రణాళికలో కేటాయించ బడింది. అందులో రూ. 0.50 లక్ష మొత్తం ఈ జిల్లాకు కేటాయించబడింది.

## అద్దె కొనుగోలు పద్ధతిమీద వ్యవసాయ పనిముట్ల పంపిణీ

చెరకు రసం తీసే యంత్రాలు, గట్లుపోసే యంత్రాలు, ధాన్యాన్ని నూర్చే యంత్రాలు, తూర్పారబెట్టే యంత్రాలువంటి ఆధునిక వ్యవసాయ పని ముట్లను నగదు చెల్లించి కొనుక్కోవడం సన్నకారు రైతులకు కష్టం. అందువల్ల అటువంటి పనిముట్లను కొని ఆంధ్ర ప్రాంతంలోని అవసరమున్న సన్నకారురైతు లకు అద్దె కొనుగోలు పద్ధతిమీద పంపిణీ చేయడానికి ఈ పథకం ఉద్దేశిస్తున్నది. ఈ పనిముట్లు ఆయిలుయింజన్లు, ఎలక్ట్రిక్ మోటారు సెట్ల మాదిరి గానే ఇవ్వబడ తాయి. వ్యక్తిగత పూచీమీద ప్రతి రైతుకు పనిముట్ల రూపంలో రూ.800/-ల గరిష్ఠ పరిమితి వరకు ఋణం ఇవ్వబడుతుంది. దీనిమీద సాలుకు నూటికి రూ. 4 వడ్డీ వసూలు చేయబడుతుంది. ఈ మొత్తం 4 సమాన వాయిదాలలో వసూలు చేయబడుతుంది. ఈ పథకం 57–58, 58–59 సంవత్సరాలలో అమలు జరప బడింది. ఈ సంవత్సరం కూడా కొనసాగింప బడుతుంది. అందుకు రూ. 1.00 లక్ష మొత్తం కేటాయించబడింది. అందులో రు. 0 10 లక్ష మొత్తం జిల్లాలో వినియోగింపబడుతుంది.

## పట్టణాలలో గోతి ఎరువు తయారీ, పంపకం

గోతి ఎరువును ఎక్కువగా తయారు చేసి, పంపకం చేయడంకోసం మున్సి పాలిటీలు, మేజరు పంచాయతీలకు ఈ పథకం క్రింద ఋణాలు ఇవ్వబడతాయి. ఆంధ్ర ప్రాంతంలోని స్థానికసంస్థలకు ఋణాలు ఇవ్వటానికి ఈ సంవత్సరపు ప్రణా కలో రూ. 3.00 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఋణ సహాయం ఈ జిల్లాలోని స్థానిక సంస్థలకు కూడా లభ్యమౌతుంది. 10,000 టన్నుల కంపోస్టు ఎరువు ఉత్పత్తిచేయబడి యీ జిల్లాలోని రైతులకు పంచబడుతుందని, యిది 2,000 ఎకరాల్లో ఉపయోగించబడుతుందని, యిందు మూలంగా 250 టన్నుల పంట అదనంగా పండుతుందని, ఆశించబడుతున్నది.

## స్థానికంగా లభ్యమయ్యే చెత్తా చెదారంతో ఎరువు తయారీ

గ్రామాలలో ప్రస్తుతం ఉత్పత్తి చేయబడుతున్న ఎరువు పరిమాణాన్ని అధి కం చేయడమే ఈ పథకం యొక్క ఉద్దేశం. స్థానికంగా లభ్యమయ్యే చెత్తా

చెదారాలను నిలువచేసి ఆధునిక పద్ధతుల మీద గోత్తి ఎరువు తయారు చేయబడు తుంది. మొదట్లో ఈ పథకాన్ని బ్లాకు ప్రాంతాలలో అమలు పరచి, తరువాత రెండవ ప్రణాళిక ఆఖరయ్యే సరికి రాజ్యం అంతా విస్తరింప చేయడానికి ఉద్దేశింప బడింది. 1957–58, 1958–59 సంవత్సరాలలో రాజ్యంలోని 56 బ్లాకులలో ఈ పథకం అమలు పరచబడింది. స్థానికంగా లభ్యమయ్యే చెత్తా చెదారంతో ఎరువును తయారు చేసుకోవడానికి గల విధానాలలో 12,566 మంది వ్యవసాయ దారులకు శిక్షణ ఇవ్వబడింది. ఇద్దరు ఫల్లు మెన్యూరియల్ ఆఫీసర్లు, 20 మంది కం పోస్టు ఇన్‌స్పెక్టర్లు, 20 మంది ఫీల్డుమెన్లు, ఒక అప్పర్ డివిజన్ గుమాస్తా, ఇద్దరు, లోయరు డివిజను గుమాస్తాలు, ముగ్గురు టైపిస్టులు, 4గురు జవానులతో కూడిన ప్రత్యేక సిబ్బంది ఈ పథకం క్రింద నియమింప బడింది. పై సిబ్బందిని కొనసాగిం చడానికి, మరి 47 బ్లాకులకు ఈ పథకాన్ని విస్తరింప చేయడానికి ఈ సంవత్సరపు ప్రణాళికలో రూ. 4.00 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఈ 47 బ్లాకు లలో 30 ఆంధ్ర ప్రాంతంలోను, 17 తెలంగాణా ప్రాంతంలోను ఉంటాయి. సుమారు 13,010 మంది వ్యవసాయదారులకు ఈ సంవత్సరం శిక్షణ ఇవ్వబడు తుందని ఆశింపబడుతున్నది. ఈ పథకం వలన ఈ జిల్లాలోని రైతులు కూడా లాభం పొందుతారు. ఈ సంవత్సరంలో ఈ క్రింద బ్లాకులకు యీ పథకం విస్త రింప చేయబడుతుంది.

1 పెదపాడు

2. నిడదవోలు

మలపదార్థముల నుండి గోత్తి ఎరువును తయారుచేయుట

సదుపాయి సౌకర్యాలున్న గ్రామ పంచాయితీలలో మలమూత్రాదుల నుండి, చెత్తనుండి గోత్తి ఎరువును ఉత్పత్తి చేయుటాన్ని ఈ పథకం ఉద్దేశిస్తున్నది. 1958–59 లో ఆంధ్ర ప్రాంతంలోని 66 పంచాయితీలకు, తెలంగాణా ప్రాంతంలోని 33 పంచాయితీలకు మొత్తం 99 పంచాయితీలకు గ్రాంటులను ఇవ్వడానికి రూ. 2.00 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఈ సంవత్సరం ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలలోని పంచాయతీలకు గ్రాంటుల క్రింద మరొక రూ.

2.00 లక్షలు ఇవ్వడానికి ఉద్దేశింప బడింది. అందులో కొంత మొత్తం ఈ జిల్లా లోని పంచాయతీలకు కూడా ఇవ్వబడుతుంది. సుమారు 800 టన్నుల గోతి ఎరువు ఉత్పత్తి చేయబడుతుంది. 160 ఎకరాల్లో ఈ ఎరువు ఉపయోగించ బడుతుంది. దీనివల్ల ఈ జిల్లాలో అదనంగా 20 టన్నుల పంట పండు తుంది.

## చేతి స్ప్రేయర్లు, చేతి డస్టరు తగ్గింపు దరలకు పంపిణీ

పంటలకు పెద్ద పెట్టున చీడలు పట్టినప్పుడు సాధ్యమైనంత త్వరలో సస్య రక్షణ చర్యలు తీసికొనేటందుకు తమకు కావలసినన్ని స్ప్రేయర్లను డస్టర్లను వ్యవసాయదారులు, సహకార సంస్థలు, పంచాయతీలు మొదలైనవి కలిగియుండే ట్లు చేయడమే ఈ పథకం యొక్క ఆశయం. ఈ పరికరాలు అసలు ధరలో సగం రేటుకు సరఫరా చేయబడతాయి. మిగిలిన సగం, రాజ్య, కేంద్ర ప్రభు త్వాలు భరిస్తాయి. 1958–59లో 500 చేతి స్ప్రేయర్లు, డస్టర్లు కొన డానికి రూ. 0.90 లక్ష మొత్తం మంజూరు చేయబడింది, ఈ సంవత్సరపు ప్రణాళికలో మరి 500 స్ప్రేయర్లు, డస్టర్లను కొని సరఫరా చేయడానికి రూ 0.90 లక్ష మొత్తం కేటాయించ బడింది. అందులో 35 రూ. 0.063 లక్ష వ్యయంతో ఈ జిల్లాకు సరఫరా చేయబడతాయి.

## ఆంధ్ర దేశంలో పండ్లతోటల అభివృద్ధి పథకం

ప్రస్తుతం పండ్ల తోటలున్న ప్రాంతాన్ని విస్తరింప చేయడం, క్రొత్త ప్రాంతంలో పండ్లతోటలు వేయిడం ద్వారాను ఫలోత్పత్తిని అధికం చేసే ఉద్దేశంతోను, వ్యవసాయోత్పత్తిని బహుముఖంగా పెంపుచేయడం కోసం ఫలో త్పత్తిని అభివృద్ధి చేసేటందుకుగాను ప్లానింగు కమీషనువారు చేసిన సిఫార్సులను పురస్కరించుకొని ఈ పథకం 57–58లో ప్రారంభించబడింది. ఈ పథకంక్రింద రైతులకు స్వల్పకాలిక ఋణాలు, దీర్ఘకాలిక ఋణాలు ఇవ్వబడతాయి. పాత తోటల్ని పునరుద్ధరించడానికి ఎకరానికి రు. 65 చొప్పున స్వల్ప కాలిక ఋణాలు ఇవ్వబడతాయి. క్రొత్తగా పండ్లతోటల్ని వేసుకోవడానికి దీర్ఘకాలిక ఋణాలు ఇవ్వబడతాయి. అవి ఎకరానికి రు. 150 నుండి రు. 300 వరకు ఇవ్వబడతాయి.

1957–58, 58–59లలో సుమారు రు. 11.00 లక్షల మొత్తం ఋణాలుగా పంపిణీ చేయబడింది. ఈ పథకాన్ని కొనసాగించడానికి ప్రణాళికలో ఈ సంవత్సరం రు. 8.86 లక్షల మొత్తం ప్రత్యేకించబడింది. ఇందులో రు. 1.86 లక్షల మొత్తం అవసరం ఏర్పడే జిల్లాలకు పంపిణీ చేసే నిమిత్తం కడప జిల్లా, ఆనంపరాజు పేటలోని ఫ్రూట్‌స్పెషలిస్టువద్ద రిజర్వులో ఉంచబడింది. మిగిలిన మొత్తంలో రు. 0.40 లక్ష మొత్తం ఈ పథకం క్రింద ఋణాల నిచ్చేటందుకుగాను ఈ జిల్లాలో వినియోగింప బడుతుంది.

## ప్రత్తి విస్తరణ పథకం

బీడు భూముల్ని బంజరు భూముల్ని సాగుక్రిందకు తీసుకరావడం, ఆహారేతర పంటలకు బదులు ప్రత్తి పంటను వేయడం, రెండు పంటలను పండించడం, పంటకీ పంటకీమధ్య ప్రత్తిపంట పండించడం, మేలురకపు విత్తనాలను పంచడం, రసాయనిక ఎరువులను వాడడం వంటి సాగుపద్ధతులను అవలంబించి రెండవ ప్రణాళికా కాలంలో బేలుకు 392 పౌనులుండే సుమారు 20,000 బేళ్ళ ప్రత్తిని అదనంగా ఉత్పత్తిచేయడానికి ఈ పథకంక్రింద ఉద్దేశింపబడింది. మొదటి మూడు సంవత్సరాలలో ఉత్పత్తి 12,000 బేళ్ళకు పెరిగింది. ఈ సంవత్సరపు ప్రణాళికలో ఈ పథకం కోసం రు. 1.40 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఈ మొత్తం ఈ దిగువ తెలుపబడిన ఉద్యోగుల క్రింద ఉంచబడుతుంది. వారు ఈ పథకంమీద అజ్మాయిషీ వహిస్తారు. వీరే విత్తనాలు మొదలైన వాటిని కొని పంపకం చేస్తారు.

| | | |
|---|---|---|
| 1. | కాటన్ ఎక్స్‌టెన్షన్ ఆఫీసరు, వ్యవసాయశాఖ డైరెక్టరేటు. | రు. లక్షలలో. 0.9190 |
| 2. | అసిస్టెంటు కాటన్ ఎక్స్‌టెన్షన్ ఆఫీసరు ఆదిలాబాదు. | 0.1496 |
| 3. | అసిస్టెంటు కాటన్ ఎక్స్‌టెన్షన్ ఆఫీసరు కడప. | 0.1742 |

4. అసిస్టెంటు కాటన్ ఎక్స్‌టెన్షన్ ఆఫీసరు గుంటూరు. 0.1572

మొత్తం 1.4000

ఈ జిల్లాలో 2000 ఎకరాలమేర ప్రత్తి పంట పండించ బడుతుంది. తత్ఫలితంగా 250 బేళ్ళ ప్రత్తి ఉత్పత్తి అవుతుంది.

చెరకు పంటకు ఎక్కువగా ఎరువు వేయడానికి సంబంధించిన పథకం

పంట దిగుబడి ఎక్కువ అయ్యేటందుకు చెరకు పంటకు ఎరువులను ఎక్కువగా వేయడాన్ని ప్రచారంలోకి తీసికొని రావడమే ఈ పథకం యొక్క ఉద్దేశం. ఈ పథకం, 1958–59 చివరి భాగంలో అమలు జరుపబడింది. ఆంధ్రలో 28 తెలంగాణాలో 12 మంది రేంజర్ల ద్వారా వివిధ కేంద్రాలలో ఈ పని జరుప బడుతూఉన్నది. ఈ పథకాన్ని 1959–60లో కొనసాగించడానికి ఉద్దేశింప బడింది. అందుకు రు. 0.30 లక్ష మొత్తం ప్రణాళికలో కేటాయించబడింది ఈ జిల్లాలో. చెరకు పండించే వ్యవసాయదారులకు కూడా ఈ పథకం వల్ల లాభం చేకూరుతుంది.

ఆంధ్రలో చెరకు పంట అభివృద్ధి

అభివృద్ధి కార్యక్రమాలను తీవ్రతరంచేసి చెరకు పంట దిగుబడిని, చెరకు రసంయొక్క నాణ్యాన్ని అభివృద్ధి పరచేఉద్దేశంతో 1956–57 లో ఈ పథకం చెరకు పండే శ్రీకాకుళం, విశాఖపట్నం, తూర్పుగోదావరి, పశ్చిమగోదావరి కృష్ణా, చిత్తూరు, అనంతపురం జిల్లాలలో అమలు పరచబడింది. రెండవ ప్రణాళిక చివరకు చెరకు ఉత్పత్తిని నూటికి 33 1/3 వంతులు అభివృద్ధి పరచడమే ఈ పథకం యొక్క అంతిమ లక్ష్యం. సాధ్యమైనచోటల్లా క్రొత్త ప్రాంతాలను చెరకు పంట క్రిందకు తీసుకరావడం మూలంగా అదనంగా చెరకు పంట పండించ బడుతుంది. పై జిల్లాలలోఉన్న 20 అభివృద్ధి కేంద్రాల్లోను 5 మండల కేంద్రాలలోను ఈపథకం అమలునందున్నది. ఇది ఈ సంవత్సరం కూడా కొనసాగింపబడుతుంది. అందుకోసం ప్రణాళికలో రు. 3.07 లక్షల మొత్తం

కేటాయించబడింది. ఇందులో రు. 0·31 లక్ష మొత్తం ఈ జిల్లాకు పై కార్య క్రమాన్ని కొనసాగించేటందుకు వినియోగింపబడుతుంది.

## పొగాకు విస్తరణ కార్యక్రమం

పొగాకులో ఉత్తమరకాలను ఉత్పత్తి చేసేటందుకు పొగాకును పండించటం, శుద్ధి పరచటం మొదలైన విషయాలను గురించి ప్రదర్శన పూర్వకంగా వివరించటంద్వారా రైతులకు వీటి విషయంలో పరిజ్ఞానాన్ని కలుగజేసే ఉద్దేశంతో ఈ పథకం 1956–57లో కృష్ణా, తూర్పు, పశ్చిమగోదావరి జిల్లాలలో అమలు పరచబడింది. ఈ విస్తరణ సేవా కార్యక్రమానికి ఒక అసిస్టెంటు టొబాకో ఎక్స్టెన్షన్ ఆఫీసరు, 12మంది ఫీల్డు అసిస్టెంట్లు, ఒక హెడ్ క్లర్కు, ఒక లోయర్ డివిజన్ గుమస్తా ఒక టైపిస్టు, 36 మంది మేస్త్రీలు నల్గురు జవానులు, ఒక జీపు డ్రైవరుతోకూడినసిబ్బంది నియమించబడింది. ఈ పథకం 1957–58లో కొనసా గింపబడింది. ఈ సంవత్సరంలో కూడా కొనసాగించ బడుతుంది. ఇందుకు రు. 0.77 లక్ష మొత్తం కేటాయించబడింది. అందులో రు. 0 22 లక్ష మొత్తం ఈ జిల్లాకు ప్రత్యేకించబడింది.

## జీడిగింజల అభివృద్ధి

ఈ రాష్ట్రంలోని బంజరు భూముల్లో జీడితోటలు వేసే ఉద్దేశంతో ప్రత్యేకంగా ఎంపిక చేయబడ్డ ప్రాంతాలలో జీడిగింజలను నాటడానికిగాను 15,000 పౌనుల మంచి రకం గింజలు సాగుచేయడానికి తలపెట్ట బడింది. జీడితోటలను విస్తరింప చేయడానికి తగు ప్రాంతాలను ఎంపిక చేయడంకోసం శ్రీకాకుళం, తూర్పుగోదా వరి, గుంటూరు జిల్లాలలోని ప్రాంతాలను సర్వే చేయడానికి తలపెట్టబడింది. ఈ పథకం క్రింద, అదనంగా మరికొన్ని ప్రాంతాలలో జీడితోటల్ని వేయడానికి పీలుగా ఎకరానికి రు. 100లు రేటు చొప్పున రైతులకు ఋణాలు మంజూరు చేయ బడ్డాయి.

ఒక క్యాషునట్ డెవలప్మెంటు ఆఫీసరు, 4గురు అసిస్టెంట్లను, ఒక అప్పరు డివిజను గుమాస్తాను, 5గురు జవానులను నియమించడంద్వారా 1958–59లో

ఈ పథకం అమలు పరచ బడింది. 3000 ఎకరాలమేర జీడితోటలు వేయడానికి రుణాలు ఇవ్వబడ్డాయి. ఈ సంవత్సరపు ప్రణాళికలో ఈ పథకాన్ని కొనసాగించడానికి, 6,000 ఎకరాలమేర జీడితోటల్ని వేయడానికిగాను రు. 6.11 లక్షల మొత్తం కేటాయించబడింది అందులో జిల్లాల అదనపు అవసరాలు ఏవైనా ఉంటే వాటికోసం, హెడ్ క్వార్టర్సులో రు. 0.12 లక్ష మొత్తం ప్రత్యేకించి ఉంచబడింది. సిబ్బంది సర్వే ఖర్చులవంటి వాటికోసం రు. 0.11 లక్ష మొత్తం కేటాయించ బడింది. మిగిలిన రు. 0.16 లక్షలు, 160 ఎకరాలమేర జీడితోటల్ని వేయడానికిగాను ఈ జిల్లాకు రుణాల రూపంలో పంచబడతాయి.

## చెరకుపంటకు చీడలు, తెగుళ్లు తగలకుండా రక్షణ కల్పించడం

చెరకు పంటకు వచ్చే తెగుళ్లలో మొగ్గకొరుకుట, కాటుక తెగులు అతిముఖ్యమైనవి. ఈ వ్యాధులను తగుసమయంలో అరికట్టడానికి చర్యలు తీసుకోవడం అత్యవసరం. సకాలంలో నివారణచర్యలు తీసుకోవడానికి వీలుకల్పించే నిమిత్తం ప్రతి మండల కేంద్రానికి రెండు విద్యుత్ స్ప్రేయర్లను, డస్టర్లను ఇవ్వడానికి ఉద్దేశింపబడింది. ఎటువల్ల సమయానికి నివారణ కార్యక్రమాన్ని చేపట్టడానికి, క్రిమిసంహారిణులను తక్కువ ధరలకు సరఫరాచేసి స్ప్రేయర్ల ఉపయోగాన్ని ప్రదర్శించి చూపడానికి వీలుపడుతుంది. ఈ పథకం 1957-58లో ప్రారంభించబడింది. 1959-60లో కూడా కొనసాగింపబడుతుంది, అందుకోసం ప్రణాళికలో రు. 0.24 లక్ష మొత్తం కేటాయించబడింది. ఈ పథకం అమలులోఉన్న 7 జిల్లాలలోను 15,800 ఎకరాలలో ఈ కార్యక్రమం అమలు జరుపబడింది. ఈ కేటాయింపు మొత్తంలో రు. 0.012 లక్ష మొత్తం ఈ జిల్లాకు కేటాయించబడింది. 790 ఎకరాలమేర ఈ కార్యక్రమం అమలుజరుపబడుతుంది.

## ఆంధ్రలో పోకతోటల పెంపకం

రాష్ట్రంలో ప్రస్తుతం ఉత్పత్తి అవుతున్న పోకచెక్కలు రాష్ట్రం యొక్క జనాభా అవసరాలకు సరిపడగాలేవు. అందువల్ల పోకచెట్ల పెంపకంలో వ్యవసాయదార్లకు ప్రోత్సాహాన్నిచ్చే ఉద్దేశంతో జయప్రదంగా ఈ పంట పండించడానికి అవకాశమున్నచోట్ల 10 ప్రదర్శన క్షేత్రాలను ప్రారంభించడానికి తలపెట్టబడింది. ప్రదర్శన క్షేత్రం 10 సెంట్ల మేర వేయబడుతుంది. ఈ పథకం, 1957-58

చివర భాగంలో ప్రారంభించ బడింది. అది 1958–59లో ఈ క్రింద 10 కేంద్రాలలో కొనసాగింపబడుతుంది.
కేంద్రం ఏర్పాటు చేయబడిన

| | గ్రామం పేరు | తాలూకా | జిల్లా |
|---|---|---|---|
| 1 | కదూరు | హిందూపురం | అనంతపురం |
| 2 | హల్లికెల | మడకశిర | అనంతపురం |
| 3 | అంగనపూడి | అనకాపల్లి | విశాఖపట్నం |
| 4 | నరసాపురం | నరసాపురం | పశ్చిమగోదావరి |
| 5 | బంగనపల్లి | నరసాపురం | పశ్చిమగోదావరి |
| 6 | తాటిపాక | రాజోలు | తూర్పుగోదావరి |
| 7 | నందంపూడి | అమలాపురం | తూర్పుగోదావరి |
| 8 | ఊటుకూరు | [illegible] | నెల్లూరు |
| 9 | కల్లూరు | కర్నూలు | కర్నూలు |
| 10 | కవిటి | ఇచ్ఛాపురం | శ్రీకాకుళం |

ఈ సంవత్సరపు ప్రణాళికలో ఈ ప్రదర్శన క్షేత్రాలను కొనసాగించడానికి రు. 0.03 లక్ష మొత్తం కేటాయించబడింది.

## కొబ్బరి తోటల విస్తరణ పథకం

కొబ్బరితోటల పెంపకానికి సంబంధించిన అనేక విషయాలమీద జరిపిన పరిశోధన ఫలితాలను గురించి సాధ్యమైన ప్రచారవ్యవస్థ సహాయంతో తీవ్రంగా ప్రచారం చేయడం ద్వారాను కొబ్బరి తోటల్ని పెంచేవారికి మంచి రకాల మొక్కల్ని సరఫరాచేయడం ద్వారాను కొబ్బరితోటలను విస్తారంగా పెంచడానికి ఈ పథకం ఉద్దేశించబడింది. ఈ పథకం సోంపేట, అంబాజీపేట, సామర్లకోట, నర్సాపురం, కదూరు కేంద్రాలలో 58-59 లో అమలుపరచబడింది. ఒక కోకోనట్ డెవలప్‌మెంటు ఆఫీసరు, 5గురు అసిస్టెంట్లు 15మంది ఫీల్డుమెన్లు, 10మంది మేస్త్రీలు ముగ్గురు అప్పరు డివిజను గుమాస్తాలు, 7గురు లోయర్ డివిజను గుమాస్తాలు, ఇద్దరు టైపిస్టులు, 8మంది జవానులు ఒక జీపు డ్రైవరు క్లీనరుతో కూడిన సిబ్బందిని నియమించడం ద్వారా ఈ పథకం అమలు జరపబడింది. ఈ పథకం ఈ సంవత్సరంకూడా కొనసాగింప బడుతుంది. అందుకోసం రు. 1.75 లక్షల మొత్తం ప్రణాళికలో కేటాయించబడింది. అందులో

రు. 0.35 లక్ష ఈ జిల్లాలోని నరసాపురం కేంద్రాన్ని కొనసాగించడానికి కేటాయించబడింది. ఈ సంవత్సరం ఈ కేంద్రంలో 40,000 కొబ్బరికాయలు పండింపబడతాయని ఆశింపబడుతున్నది.

## కొబ్బరి మొక్కల ఉత్పత్తిని రెండింతలు చేయడం

పెంపకం దారులకు మేలురకం మొక్కలను సరఫరాచేసే ఉద్దేశంతో కొబ్బరి మొక్కల ఉత్పత్తిని రెండింతలు చేయడానికి ఈ పథకం ఉద్దేశించబడింది. ఈపథకం సామర్లకోట, అనకాపల్లి, మార్టేరులలో 1958–59లో ప్రారంభించబడింది. ఈ సంవత్సరంకూడా రు. 0.87లక్ష వ్యయంతో ఇది కొనసాగింపబడుతుంది. అందులో రు. 0 07లక్ష ఈ జిల్లాలోని మార్టేరు కేంద్రానికి కేటాయించబడింది. ఈ సంవత్సరం ఈ కేంద్రంలో 20,000 కాయలు ఉత్పత్తి అవుతాయని ఆశించబడుతున్నది.

## నూనెగింజల అభివృద్ధి పథకం

నూనెగింజల ఉత్పత్తిని అధికం చేయటానికి ఈ పథకం ఉద్దేశింపబడింది. ఈ పథకం క్రింద మేలురకం విత్తనాలను వాడడంలోను, తగినంత ఎరువును వేయడంలోను, సస్యసంరక్షణ చర్యలను తీసుకోవడంలోను తీవ్రమైన ప్రచారం చేయబడుతుంది. ప్రదర్శన పూర్వకంగాకూడ రైతులకు వివరింప బడుతుంది. ఒక పైరుకు మరొక పైరుకు మధ్య ఈ పంటను పండించే విషయమై కూడ ప్రచారం చేయడం ప్రదర్శన పూర్వకంగా వివరించడం జరుగుతుంది. రాజేంద్రనగర్‌లోని ఆయిలు సీడ్సు స్పెషలిస్టు పర్యవేక్షణక్రింద ఆంధ్ర జిల్లాలు తొమ్మిదింటి లోను, తెలంగాణా జిల్లాలు అయిదింటి లోను, 1958–59లో ఈ పథకం అమలు జరపబడింది 1958–59లో ఈ క్రింద తెలుపబడిన సిబ్బందికూడా నియమించబడింది.

| | | |
|---|---|---|
| అసిస్టెంటు ఆయిల్ సీడ్సు డెవలెప్‌మెంటు ఆఫీసర్లు | — | 2 |
| అసిస్టెంట్లు | — | 11 |
| ఫీల్డుమెన్లు | — | 22 |
| అప్పర్ డివిజను గుమాస్తాలు | — | 4 |

| | | |
|---|---|---|
| లోయరు డివిజను గుమాస్తాలు | — | 16 |
| టైపిస్టులు | — | 3 |
| జీపుడ్రైవర్లు | — | 2 |
| జవానులు | — | 17 |
| వాచ్ మెన్లు | — | 2 |

ఈ పథకాన్ని 1959–60లో కొనసాగించడానికి ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 2.71 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఈ పథకం క్రింద లాభంచేకూరే 14 జిల్లాలలో ఈ జిల్లా ఒకటి.

### అరటి పరిశోధన కేంద్రం

1957–58లో పశ్చిమగోదావరిజిల్లా తణుకులో ఒక అరటి పరిశోధన కేంద్రం స్థాపించబడింది. స్థానిక పరిస్థితులకు తగిఉండే అరటిరకాలను ఉత్పత్తి చేయుడానికి, అరటి తోటలకు ఉత్తమ వ్యవసాయ పద్ధతులను, ఎరువు పరిమాణాలను నిర్ణయించడానికి, ఈ పథకం ఏర్పాటుచేయబడింది. ఈ పరిశోధన కేంద్రాన్ని కొనసాగించ డానికి ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.25 లక్ష మొత్తం కేటాయించబడింది.

### ఫీలుమెను, డెమానుస్ట్రేషను మేస్త్రీలకు శిక్షణ

ఆధునిక వ్యవసాయ పద్ధతులలో ఆరు నెలలపాటు ఫీల్డు మెన్లకు, డెమానుస్ట్రేషను మేస్త్రీలకు శిక్షణ ఇవ్వడానికి ఈ పథకం ఉద్దేశిస్తున్నది. ఆధునిక వ్యవసాయ పద్ధతులనుగురించి ప్రదర్శనలను ఏర్పాటు చేయడానికి, విస్తృతమైన ప్రచారం జరపడానికి వారు వ్యవసాయ శాఖలో నియమించబడతారు. రెండవ ప్రణాళిక మొదటి రెండు సంవత్సరాలలో, ఆంధ్ర ప్రాంతంలోని ఈ క్రింద కేంద్రాలలోను 187గురు డెమానుస్ట్రేషను మేస్త్రీలకు శిక్షణ ఇవ్వబడింది.

| | | |
|---|---|---|
| 1 | చెరకు పరిశోధన కేంద్రం, | అనకాపల్లి |
| 2 | వ్యవసాయ పరిశోధన కేంద్రం, | సామర్లకోట |

| | | |
|---|---|---|
| 3 | వ్యవసాయ పరిశోధన కేంద్రం, | మారుటేరు |
| 4 | కళాశాల క్షేత్రం, | బాపట్ల |
| 5 | వ్యవసాయ పరిశోధన కేంద్రం | నంద్యాల |

1958-59లో ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలనుండి వచ్చిన 178 మంది డెమానుస్ట్రేషను మేస్త్రీలు, 178 మంది ఫీల్డుమెన్లు ఆంధ్రప్రాంతంలోని పై 5 కేంద్రాలలోను, తెలంగాణా ప్రాంతంలోని ఈ క్రింది 3 కేంద్రాలలోను శిక్షణకోసం చేర్చుకోబడ్డారు.

| | | |
|---|---|---|
| 1 | గవర్నమెంటు మెయిన్‌ఫారం, | రాజేంద్రనగర్ |
| 2 | గవర్నమెంటు మెయిన్‌ఫారం. | వరంగల్లు |
| 3 | గవర్నమెంటు ఎక్స్‌పరిమెంటల్ స్టేషను, | రుద్రూరు |

శిక్షణ కార్యక్రమం ఈ సంవత్సరం కూడా కొనసాగించ బడుతుంది. 178 మంది డెమానుస్ట్రేషను మేస్త్రీలు, 178 మంది ఫీల్డుమెన్లు చేర్చుకోబడ తారు. అందుకోసం ప్రణాళికలో రు. 0.81 లక్ష మొత్తం కేటాయించబడింది. ఈ మొత్తంలో 0.09లక్ష, ఈ జిల్లాలోని మారుటేరులో ఉన్న వ్యవసాయ పరిశోధన కేంద్రంలో 20 నుండి 26 మంది వరకు డెమాన్‌స్ట్రేషన్ మేస్త్రీలు, ఫీల్డుమెన్లకు శిక్షణ ఇవ్వడం కోసం వినియోగింప బడుతుంది.

## ఆయిలు ఇంజన్లకు సంబంధించి వ్యవసాయదారులకు శిక్షణనిచ్చే పథకం

ఈ పథకం తెలంగాణాలో అమలు పరచబడింది. ఆయిలు ఇంజన్లను నడపడంలోను, సరియైన పద్ధతుల్లో ఉంచుకోవడంలోను వ్యవసాయ దారులకు శిక్షణ నిచ్చేటందుకు ఆంధ్ర ప్రాంతానికి 1958-59లో విస్తరింపచేయ బడింది. ఈ పథకాన్ని కొనసాగించడానికి, 420 మంది వ్యవసాయదారులకు శిక్షణ ఇచ్చేటందుకు ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.16 లక్ష మొత్తం కేటాయించబడింది. ఈ జిల్లాలోని రైతులు కూడా ఈ శిక్షణవల్ల లాభం పొందుతారు.

## సిబ్బందికి సంబంధించిన సమగ్రి పథకం

వ్యవసాయశాఖకు సంబంధించిన ప్రణాళికా పథకాలను కట్టుదిట్టంగా పర్య వేక్షించడానికి, విజయవంతంగా నిర్వహించడానికి ప్రధాన కార్యాలయంలోను జిల్లాలలోను అదనంగా పర్యవేక్షక (సాంకేతిక) సిబ్బందిని, గుమాస్తాలను నియమించడానికి తలపెట్టబడింది. ఇది 1956-57 నుండి కొనసాగుతూ వస్తున్న పథకం. ప్రణాళికలోని మొదటి మూడు సంవత్సరాలలోను నియమించబడిన అదనపు సిబ్బందిని కొనసాగించడానికి రు. 2.93 లక్షల మొత్తం ఈ సంవత్సరపు ప్రణాళికలో కేటాయించబడింది. అందులో కొంత మొత్తం ఈ జిల్లాలో ఇది వరకు నియమించబడిన సిబ్బందిని కొనసాగించడానికి వినియోగించబడుతుంది.

## పిరిక్యులారియా వ్యాధినోకని వరి జాతుల ఉత్పత్తికి పథకం

ఆంధ్ర ప్రాంతంలోని వివిధ వాతావరణ మండలాలకు తగిఉండే, పిరిక్యులరియా వ్యాధి నోకని మంచిరకం వరి రకాలను ఉత్పత్తి చేయడం, త్వరితంగా ఎదుగుతూ, కొల్లేరు ముంపుకుతట్టుకోగల రకాలను ఉత్పత్తి చేయడమే ఈ పథకం యొక్క ఉద్దేశం. ఈ ఉద్దేశంతోనే కొల్లేరు ప్రాంతానికి తగిఉండే వరిజాతులను ఉత్పత్తిచేసి సంపాదించడానికి పరిశోధన జరపాలని తలంచబడింది. ఈ పరిశోధన రాజేంద్రనగర్‌లోని ప్యాడీస్పెషలిస్టు పర్యవేక్షణ క్రింద బుచ్చిరెడ్డిపాలెం వ్యవసాయ పరిశోధన కేంద్రంలోను, పశ్చిమగోదావరి జిల్లా పూళ్లలోను జరుపబడుతుంది. 1958-59లో ఒక అసిస్టెంటు ప్యాడీస్పెషలిస్టు, ఒక సైంటిఫిక్ అసిస్టెంటు, ఒక పెథాలాజికల్ అసిస్టెంటు, ఒక ఫీల్డుమెను, ఒక అప్పర్ డివిజను గుమాస్తా, ఒక కెమిస్టుతో కూడిన సిబ్బందిని బుచ్చిరెడ్డిపాలెం వ్యవసాయ పరిశోధన కేంద్రము లోను, ఒక సైంటిఫిక్ అసిస్టెంటు, ఒక ఫీల్డుమెను పూళ్లలోను నియమించబడ్డారు. పై సిబ్బంది ఈ సంవత్సరంకూడా కొనసాగింపబడుతుంది. అందుకోసం రు. 0.17 లక్ష మొత్తం ప్రణాళికలో కేటాయించ బడింది.

## ఆంధ్రప్రదేశ్‌లో నలగర్ కమిటీ సిఫార్సులను అమలు పరచడానికి నామమాత్రపు కేటాయింపు

భారత ప్రభుత్వంవారు 1957–58లో అగ్రికల్చరల్ అడ్మినిస్ట్రేటివ్ కమిటీ అనే ఒక కమిటీని ఏర్పాటు చేశారు. రాజ్యాలలో నమూనా వ్యవసాయ సంస్థలను స్థాపించే విషయం గురించి, వ్యవసాయ శాఖకు చెందిన అన్నిరకాల ఉద్యోగులకు కూడ తమకు అప్పచెప్పబడిన కార్యక్రమాన్ని బాధ్యతతో నిర్వహించేటందుకు పెలుగాతగిన అధికారాలను కలిగియుండటంకోసం అన్ని స్థాయిలలోని ఉద్యోగులకు అధికారాలను అప్పగించే పద్ధతుల్ని సిఫారసు చేయడానికి ఈకమిటీ ఏర్పాటు చేయబడింది. కమిటీనివేదిక ఇటీవలే అందింది. దానినిపరిశీలించి సిఫార్సులను అమలు పరచడానికిగాను వివరమైన ప్రతిపాదనలకు తుది రూపమీయబడేవరకు 59–60 ప్రణాళికలో రు. 1.00లక్ష మొత్తం నామ మాత్రంగా కేటాయించబడింది.

## వ్యవసాయోత్పత్తి సూచీలను తయారుచేయడం

రాజ్యంలోని వ్యవసాయ అర్థిక వ్యవస్థకు సంబంధించిన వివిధసూచీలను తయారుచేయడానికి ఈ పథకంక్రింద ప్రతిపాదించబడింది వ్యవసాయోత్పత్తికి, బోలాలలో పంటలధరలకు, వ్యవసాయకూలికి సంబంధించిన సూచీలు ఇందులో ఉంటాయి. ఈ పథకం 1957–58 లో అమలు పరచబడి, 1958–59 లో కొనసాగించబడింది. అది ఈ సంవత్సరంకూడా కొనసాగడం కోసం 0 06 లక్ష మొత్తం కేటాయించబడింది.

## పట్వారీల పనిమీద సరియైన పర్యవేక్షణ

భూమి విస్తీర్ణపు వివరాలు మొదలైనవాటిని రికార్డు చేయడంలోను, రాజ్యంలో ఎన్ని ఎకరాలమేర ఏయే పంటపండుతున్నది సరియైన అంచనాలను తయారు చేసుకోడానికిగాను జిల్లాస్థాయిలో ముఖ్యమైన పంటలు పండే భూమి విస్తీర్ణపు వివరాల విషయంలో సర్దుబాటులు చేయడంలోను పట్వారీలు కరణాలు మొదలైన వారిమీద తగు పర్యవేక్షణను జరిపించడం ఈ పథకం ఉద్దేశం. అవసరమయ్యే సిబ్బందిని నియమించటం ద్వారా రాజ్యంలోని జిల్లాలన్నిటిలోని ఈ సంవత్సరం

ఈ పథకాన్ని అమలు పరచడానికి ఉద్దేశింపబడింది. అందుకోసం ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.88 లక్ష మొత్తం కేటాయించబడింది. ఈ రంగంలో జరిగే పనిని రెవిన్యూ ఇన్స్‌పెక్టర్లు చూస్తుంటారు. దానిని కౌన్సిల్లార్లు ఈ పథకం క్రింద నియమింపబడిన ఎకనామిక్ ఇన్‌వెస్టిగేటర్లు పర్యవేక్షిస్తారు. ప్రణాళిక పర్యవేక్షణ, వివరాల వర్గీకరణ విభజన విషయాలమీద అర్థగణాంకశాఖ అజ్మాయిషీ వహిస్తుంది.

## విస్తరణ శిక్షణ కేంద్రాలు

ఇంతకుముందు గ్రామసేవకులుగా నియమించడానికి ఎంపిక చేయబడ్డ విద్యార్థులు ఒకసంవత్సరం ప్రాతిపదిక వ్యవసాయ విధానాలలోను, 6 మాసాలువిస్తరణ పద్ధతులలోనుమొత్తం 18మాసాలు పాటుశిక్షణ పొందేవారు. ఈ రెండుకోర్సులు వేరు వేరుగానే పరిగణింపబడుతుండేవి. కోర్సును విజయవంతంగా పూర్తిచేసిన అభ్యర్థులకు వేర్వేరు సర్టిఫికేట్లు ఇవ్వబడుతుండేవి. శిక్షణస్థాయిని పెంచే ఉద్దేశంతో ఈ రెండు కోర్సులను ఏకీకృతం చేయడానికి నిర్ణయింపబడింది. ఆ ప్రకారం రాజ్యంలోని నాలుగు విస్తరణ శిక్షణ కేంద్రాలను, ఐదు బేసిక్ వ్యవసాయ పాఠశాలలను గ్రామసేవక శిక్షణ కేంద్రాలనబడే 8 ఏకీకృత సంస్థలుగా మార్చడం ద్వారా వాటిలో 1958 అక్టోబరు లగాయతు ఈ ఏకీకృత కోర్సు ప్రవేశ పెట్టబడింది. ఈ ఎనిమిది గ్రామసేవక శిక్షణ కేంద్రాలు, తూర్పుగోదావరి జిల్లాలోని సామర్లకోటలోను, పశ్చిమగోదావరి జిల్లాలోని గోపన్నపాలెంలోను, చిత్తూరుజిల్లాలోని కాళహస్తిలోను, గుంటూరు జిల్లాలోని బాపట్లలోను, కర్నూలు జిల్లాలోని నంద్యాలలోను, విశాఖపట్టణం జిల్లాలోని అనకాపల్లిలోను ఒక్కొక్కటి, హైదరాబాదు జిల్లాలోని రాజేంద్రనగర్‌లో రెండు నెలకొల్పబడ్డాయి. ఈ సంవత్సరంలో పై శిక్షణ కేంద్రాలలో ఆంధ్ర ప్రాంతానికిచెందిన 511 మంది, తెలంగాణా ప్రాంతానికి చెందిన 116 మంది–మొత్తం 627 మంది శిక్షణ పొందుతారు.

గ్రామసేవకులకు శిక్షణ గరిపేటందుకు సామర్లకోట, రాజేంద్రనగర్‌లలో ఒక్కొక్కటి చొప్పున ప్రస్తుతం రెండు గృహశాస్త్రబోధనా విభాగాలున్నాయి. ఒక్కొక్క కేంద్రంలో 20మంది శిక్షణ పొందడానికివీలుంది. క్రొత్తగా

బ్లాకులు ప్రారంభించడంవల్ల అవసరమయ్యే శిక్షణ పొందిన గ్రామ సేవకులకోసం సామర్లకోట, రాజేంద్రనగరులలో ప్రస్తుతం ఉన్న రెండు సంస్థల్లోను అభ్యర్థుల సంఖ్యను 1958–59లో ఒక్కొక్కదానిలో 20 నుండి 40 వరకు పెంచడం జరిగింది. సంవత్సరానికి 40 మంది గ్రామసేవకులకు శిక్షణ ఇచ్చేటందుకు వీలుగా కాళహస్తిలో మరొక గృహశాస్త్రబోధనా విభాగం స్థాపించ బడింది. ఈ సంవత్సరంలో 120 మంది గ్రామసేవికలు 3 గృహశాస్త్రబోధనా విభాగాలలో శిక్షణపొందుతారు.

సామర్లకోట, రాజేంద్రనగర్‌లలో గ్రామసేవికల శిక్షణకేంద్రాలకు రెండు వర్క్‌షాపు విభాగాలు అనుబంధింపబడి ఉన్నాయి. మేలు రకం వ్యవసాయ పని ముట్లను మరమ్మత్తు చేయడంలోను, ఉత్పత్తి చేయడంలోను ప్రతి సంవత్సరం ఒక్కొక్క విభాగంలో 20 మంది గ్రామ గ్రామీకుల బాలురకు శిక్షణ ఇవ్వ టానికి ఇవి ఉద్దేశింపబడ్డాయి. ఇంతవరకు సామర్లకోట వర్క్‌షాపు విభాగంలో 60 మంది, రాజేంద్రనగర్ విభాగంలో 27 మంది, మొత్తం 87 మంది పని వారికి శిక్షణ ఇవ్వబడింది. ఈ సంవత్సరంలో ఈ రెండు విభాగాలలోను మరి 40 మంది శిక్షణ పొందుతారని ఆశింపబడుతున్నది. ఈ సంవత్సరపు శిక్షణ కార్యక్రమం కోసం 1959–60 ప్రణాళికలో రు. 9.16 లక్షల మొత్తం కేటాయించబడింది.

# చిన్న తరహా నీటి పారుదల పనులు

## బకాయి పనులు

బకాయి పనులనిర్వహణనిమిత్తం ఈ జిల్లాకు 1959–60 లో సంవత్స రానికి రూ. 1.28 లక్ష మొత్తం కేటాయించబడింది. ఈపనుల వివరాలు ఈ దిగువ ఇవ్వబడ్డాయి.

| వరస సంఖ్య | పథకం పేరు | రూ. లక్షలలో కేటాయింపు |
|---|---|---|
| 1. | సోమరాజు ఇల్లిందుపర్రు వద్ద జి. వి. ఛానల్ లాక్ | 0.50 |
| 2. | పులివాగు పథకం | 0.78 |

## వరదకట్ట నిర్మాణం

ఈ సంవత్సరంలో ఈ జిల్లాలో రూ. 0.10 లక్ష వ్యయంతో ఒక వరదకట్ట నిర్మించబడుతుంది.

| | కేటాయింపు (రూ. లక్షలలో) |
|---|---|
| 1. వెంపనుండి ముత్యాలపల్లికి వరదకట్ట | 0.10 |

## లక్కవరం ఆనకట్ట పథకం

234 ఎకరాల ఆయకట్టుకు నీటిపారుదల కలిగించుటకొరకు లక్కవరం వద్ద ఎఱ్ఱకాల్వకు అడ్డంగా ఆనకట్ట నిర్మాణానికి ఈ పథకం ఉద్దేశిస్తున్నది. ఈ ప్రాజెక్టు ప్రారంభించడానికి 1959–60 ప్రణాళికలో రూ. 0.80 లక్ష మొత్తం కేటాయించబడింది.

## చెరువుల అభివృద్ధి పథకం

రెండవ ప్రణాళికా కాలంలో, 9,469 ఎకరాల క్రొత్త ఆయకట్టుకు 29,545 ఎకరాల ప్రస్తుత ఆయకట్టుకు లాభం కలిగించడానికి గాను ఆంధ్ర జిల్లాలలో క్రొత్తగా చిన్న తరహా నీటి పారుదల పనులను ప్రారంభించడానికి, పాతవి చెరువులను పునరుద్ధరించడానికి ఉద్దేశించబడింది. ఈ పథకం క్రింద ఈ సంవత్సరానికి రూ. 13.12 లక్షల మొత్తం కేటాయించబడింది. ఈ పథకం క్రింద నీకు రే లాభాలు ఈ జిల్లాకుకూడా లభ్యమౌతాయి.

## ఫిల్టర్ పాయింటు బావులు

ఈ పథకం క్రింద వ్యవసాయదారుల పొలాలలో ఫిల్టర్ పాయింటు గొట్టపు బావులు త్రవ్వబడతాయి. వారికి ఫిల్టర్ పాయింట్లు, ఇతర పరికరాలు సరఫరా చేయబడతాయి. ట్యూబులకు, సరఫరా చేయబడిన పరికరాలకు అయ్యే ఖర్చుఅంతా పూర్తిగా వసూలు చేయబడుతుంది. అవసరమయ్యే పంపింగు యంత్రాలను కొనడానికి వీలుగా ప్రతివ్యక్తికి రూ. 2,500 గరిష్ఠ మొత్తం వరణ

ఋణాలు మంజూరు చేయబడతాయి. ఋణాలు, ప్రభుత్వం వారు ఎప్పటికప్పుడు నిర్ణయించే వడ్డీతో 5 సమాన వాయిదాలలో రైతులనుండి వసూలు చేయబడ తాయి. 1959—60 లో 140 ఫిల్టర్ పాయింట్ల త్రవ్వకానికి గాను ఋణాలు నివ్వడానికి రూ. 3.50 లక్షల మొత్తం కేటాయించ బడింది. అందులో రూ. 0.825 లక్ష 33 ఫిల్టర్ పాయింట్లను త్రవ్వడానికి ఋణాలను మంజూరు చేసే నిమిత్తం ఈ జిల్లాకు కేటాయించ బడింది.

## అద్దెకొనుగోలు పద్ధతిమీద అయిలు ఇంజన్ల, ఎలక్ట్రిక్ మోటర్ల పంపిణీ

నీటి పారుదలకోసం నీటిని తోడు కోవడానికిగాను అయిలు ఇంజన్లు, ఎలక్ట్రిక్ మోటారు పంపుసెట్లు, కొనుక్కోవడానికి శక్తిలేని రైతులకు అవి సరఫరా చేయబడతాయి. అయిలు ఇంజన్లకు రు. 4000 ఎలక్ట్రిక్ మోటార్లకు రు. 2000 గరిష్ఠ మొత్తం ఋణాలు ఇవ్వబడతాయి ఈ మొత్తం 4% వడ్డీ 3% సెంటేజీ చార్జీతో సహా 5 నుండి 7 వాయిదాలలో వసూలు చేయబడుతుంది. ఈ సంవత్సరంలో 122 అయిలు ఇంజన్లు, 155 ఎలక్ట్రిక్ మోటరుపంపుసెట్లు సరఫరా చేసేనిమిత్తం ప్రణాళికలో రు. 8.00 లక్షల మొత్తం కేటాయించ బడింది. పై కేటాయింపులో రు. 1.34 లక్ష మొత్తం, 11 అయిలు ఇంజన్లు, 16 ఎలక్ట్రిక్ మోటార్లు సరఫరాచేయుట కోసం ఈ జిల్లాకు కేటాయించబడింది.

## గొట్టపు బావుల పథకం

భారత ప్రభుత్వంవారి సహాయంతో టి. సి ఎం. కార్యక్రమం క్రింద ఆంధ్ర ప్రాంతంలో 25 ప్రయోగాత్మక గొట్టపు బావులను త్రవ్వడానికి ఈ పథకం క్రింద తలపెట్టబడింది. 1958—59 లో 15 ప్రయోగాత్మక గొట్టపు బావులు త్రవ్వ బడ్డాయి. ఈ సంవత్సరంలో రు. 10.27 లక్షల మొత్తం ఈ పథకాన్ని కొన సాగించడానికి కేటాయించబడింది. పవర్ డ్రిల్లు పథకాన్ని అమలు పరచడానికి ఈ పథకంక్రింద పవర్ డ్రిల్లును కొనడం, అసిస్టెంటు ఇంజనీర్లను నియమించడం జరుగుతుంది. సహాయక సిబ్బందికి, ఉపకరణాల తయారీ, మరమ్మత్తుల వర్కుషాపు లను నెలకొల్పడానికి ఈ పథకంలో ఏర్పాటు ఉన్నది. దీనివల్ల కలిగే ప్రయోజ నాలు ఈ జిల్లాకుకూడా లభ్యమౌతాయి.

### ఆర్టీజియన్ బావుల త్రవ్వకానికి ఋణాల మంజూరు

చేతితో ఉపయోగింపబడే బోరింగు సెట్లు, పవర్ డ్రిల్లులతో ఆర్టీజియన్ బావుల త్రవ్వకానికిగాను మనిషికి రూ. 4,500/– చొప్పున ఈ పథకం క్రింద ఋణాలు ఇవ్వబడతాయి. 1959–60 ప్రణాళికలో 50 ఆర్టీజియన్ బావుల త్రవ్వకానికిగాను ఋణాలనిచ్చేటందుకు రూ. 1.04 లక్ష మొత్తం కేటాయించ బడింది. పై కేటాయింపులో రూ. 0·52 లక్ష మొత్తం 25 బావులను త్రవ్వకో డానికి ఋణాల మంజూరు నిమిత్తం ఈ జిల్లాకు కేటాయించ బడింది.

### క్రొత్త బావుల సబ్సిడీ పథకం

వ్యవసాయయోత్పత్తిని అధికం చేసేందుకు నీటి పారుదల బావులను త్రవ్వు కొనేందుకు రైతులకు సబ్సిడీరూపంలో ఈ పథకం క్రింద బావి ఒక్కింటికి రూ. 750 లు చొప్పున ఇవ్వబడుతుంది. 1959–60 లో ఆంధ్ర ప్రాంతంలో 2060 బావుల త్రవ్వకానికిగాను సబ్సిడీల క్రింద రూ. 18 125 లక్షల మొత్తం కేటాయించ బడింది. పైకేటాయింపులో, రూ. 0.375 లక్షల మొత్తం 50 బావుల త్రవ్వకానికిగాను ఈ జిల్లాకు కేటాయించ బడింది.

## భూమి అభివృద్ధి

### ట్రాక్టర్లు, బుల్ డోజర్లతో భూమిని బాగుచేయడానికి పథకం

బుల్ డోజర్లకు గిరాకీ ఎక్కువగా ఉండడం వల్ల, రైతులకు అద్దెకు ఇవ్వ డానికి గాను రెండవ ప్రణాళికలో బుల్ డోజర్లను కొనడానికి తలపెట్ట బడింది. విదేశీమారక ద్రవ్యం యిబ్బందివల్ల ఇంతవరకు బుల్ డోజర్లను కొనడానికి వీలులేక పోయింది. అయితే ఈ సంవత్సరం 6 బుల్ డోజర్లను కొనడానికి తల పెట్ట బడింది. అందు కోసం ప్రణాళికలో రూ. 5.30 లక్షల మొత్తం కేటా యించ బడింది. అవి ఈ జిల్లాలోని రైతులకు కూడా అద్దెకు లభ్యమౌతాయి.

# పశు గణాభివృద్ధి

## కీలక గ్రామ పథకం

పశుగణాభివృద్ధి కోసం ఎంపిక చేయ బడ్డ ప్రాంతాలలో కట్టుదిట్టమైన కృషి జరిపేటందుకు ఈ పథకం క్రింద ఉద్దేశింప బడింది. ఆబోతులకు విత్తు కొట్టడం కృత్రిమ గర్భోత్పత్తి కేంద్రాల ఆజ్మాయిషీ క్రింద దూడల పెంపకం, సబ్సిడీ మీద దూడలను పోషించడం, సహకార పద్ధతులమీద పశుగ్రాసపు పంటలను అభివృద్ధి పరచడం ఈ పథకంలో చేరి ఉంటాయి. 1957-59 ల లో ఆంధ్ర దేశంలో 10 కీలక గ్రామ కేంద్రాలు స్థాపించ బడ్డాయి. మరో 9 కేంద్రాలను స్థాపించడానికి, ఇది వరకే ప్రారంభించ బడిన కేంద్రాలను కొన సాగించడానికి, తల పెట్ట బడింది. అందుకోసం 1959-60 ప్రణాళికలో రూ. 11.107 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఈ మొత్తంలో రూ. 0.02 లక్ష ఒక క్రొత్త కీలకగ్రామ కేంద్రాన్ని, ఒక పట్టణ కృత్రిమ గర్భోత్పత్తి కేంద్రాన్ని ప్రారంభించ డానికి, ఒక పాత కేంద్రాన్ని కొనసాగించ డానికి ఈ జిల్లాకు కేటాయించ బడింది.

## గోశాలల అభివృద్ధి

ద్రవ్యసహాయం చేయటంద్వారా గోశాలలను అభివృద్ధి పరచడం ఈ పథకం ఉద్దేశం. 1959-60లో 4 క్రొత్త గోశాలలకు, 5 పాతవాటికి ద్రవ్యసహాయం చేయడానికి తలపెట్ట బడింది. అందుకు రూ. 0.81 లక్ష మొత్తం ప్రణాళికలో కేటాయించ బడింది. అందులో రూ. 0.138 లక్ష ఒక గోశాలకు ద్రవ్య సహాయం చేయడంకోసం ఈ జిల్లాకు కేటాయించ బడింది.

## జిల్లా, రాజ్యపశు ప్రదర్శనాలు

పశువులను పెంచే వారిలో ఉత్సాహాన్ని రేకెత్తించేటందుకు శాస్త్రీయ పద్ధతులలో దూడలను పెంచడం పోషించడం గురించి ప్రజలకు తెలియచెప్పడానికి గానురాజ్యప్రదర్శనాలను, జిల్లా ప్రదర్శనాలను ఏర్పాటు చేయడానికి ఈ పథకం ఉద్దేశిస్తున్నది. 1959-60 లో 4 జిల్లా ప్రదర్శనాలను జరపడానికి ఈ జిల్లాకు రూ. 0.022 లక్ష మొత్తం కేటాయించ బడింది.

## కోళ్ళ పెంపకపు విస్తరణ, అభివృద్ధి కేంద్రాలు

భారత ప్రభుత్వం వారు ప్రారంభించిన పైలెట్ ప్రాజెక్టు అభివృద్ధి పథకం క్రింద ఆంధ్ర ప్రాంతంలో 1957–59 ల లో 12 కోళ్ళ పెంపకపు విస్తరణ కేంద్రాలు ప్రారంభించబడ్డాయి. ఇదివరకే ప్రారంభింప బడిన కేంద్రాలను కొనసాగించడమే కాకుండా 1959–60 లో మరి 4 విస్తరణ కేంద్రాలను ప్రారంభించ డానికి కూడా తలపెట్ట బడింది. అందుకు ప్రణాళికలో రూ. 2.76 లక్షల మొత్తం కేటాయించ బడింది. అందులో రూ. 0.51 లక్ష మొత్తం ఒక పాత విస్తరణ కేంద్రాన్ని కొనసాగించ డానికి ఈ జిల్లాకు కేటాయించ బడింది.

## వివిధ రకాల పశువుల సరఫరా

స్థానికంగా ఉండే పశుగణాన్ని అభివృద్ధి పరచే ఉద్దేశంతో రెండవ ప్రణాళికా కాలంలో రైతులకు తగ్గింపు రేట్లకు అంటే అసలు ఖరీదులో సగానికి ఆబోతులను. దున్న పోతులను మేకలను, మేకపోతులను, పందులను, పోతుపందులను పొట్టేళ్లను, విదేశీ కోడి పుంజుల్ని, పెట్టల్ని, గ్రుడ్లను పంపిణీ చేయడానికి ఉద్దేశింప బడింది. 1959–60 లో ఈ జిల్లాలో పంచదలచుకున్న పశువుల సంఖ్య, వాటి క్రింద కేటాయించిన మొత్తాలు ఈ దిగువ తెలుప బడ్డాయి.

| | సంఖ్య | కేటాయించిన మొత్తం (రూ. లక్షలలో.) |
|---|---|---|
| 1. ఆబోతుల సరఫరా | 9 | 0.0945 |
| 2. దున్న పోతులు | 10 | 0.105 |
| 3. మేక పోతులు | 8 | 0.009 |
| 4. ఆడ మేకలు | 9 | 0.008 |
| 5. పోతు పందులు | 5 | 0.0138 |
| 6. ఆడ పందులు | 3 | 0.008 |
| 7. పొట్టేళ్ళు | 6 | 0.005 |

| | | | |
|---|---|---|---|
| 8. | విదేశీ కోడిపుంజులు | 170 | 0.02 |
| 9. | విదేశీ కోడిపెట్టలు | 170 | 0.02 |
| 10. | విదేశీజాతి గ్రుడ్లు | 400 | 0 004 |

## జిల్లా కోళ్ళ పెంపకపు కేంద్రాలు

ప్రస్తుతం ఉన్న కోళ్ళ పెంపకపు కేంద్రాలు, ప్రైవేటు వ్యక్తులు ఉత్పత్తి చేస్తున్న విదేశీజాతి కోళ్ళసంఖ్య ఏమాత్రం తగినంతగా ఉండనికారణంగాను, కావలసినన్ని విదేశీజాతి కోళ్ళను సమకూర్చే ఉద్దేశంతోను 1959–60 లో రెండు జిల్లాల కోళ్ళపెంపకపు క్షేత్రాలు ప్రారంభించడానికి తలపెట్ట బడింది. అందులో ఒకటి ఈ జిల్లాలో నెలకొల్ప బడుతుంది. దానికోసం రూ. 0 50 లక్ష మొత్తం కేటాయించబడింది.

## జిల్లా వెటర్నరీ కార్యాలయాల్లోను, ప్రధాన కార్యాలయంలోను అదనపు సిబ్బంది

పని ఎక్కువ కావడం వల్ల అవసరమైన అదనపు సిబ్బందిని ప్రధాన కార్యాలయంలోను, చింతలదీవి ప్రభుత్వ పశుగణక్షేత్రంతో సహా జిల్లా వెటర్నరీ కార్యాలయాల్లోను నియమించడానికి తలపెట్ట బడింది. అందుకు 1959–60 పరిణాళికలో రూ. 0.72 లక్ష మొత్తం కేటాయించ బడింది ఆ మొత్తంలో ఈ జిల్లాకు రూ. 0.052 లక్ష మొత్తం ప్రత్యేకించబడింది.

## గాళ్ళవ్యాధి నిర్మూలనా పథకం

దేశంలో గాళ్ళ వ్యాధిని నిర్మూలించే ఉద్దేశంతో భారత ప్రభుత్వం వారు వ్యాధిరాకుండా పశువులన్నిటికి టీకాలు వేయడానికి ఒక పథకాన్ని ప్రారంభించారు. ఈ టీకాల ఉద్యమం ద్వారా టీకాలు వేయబడకుండా మిగిలిపోయిన పశువులకోసం గుంటూరు, నెల్లూరు, చిత్తూరు, కడప, అనంతపురం, కర్నూలు జిల్లాలలో టీకాలు వేయడానికిగాను మరొక పథకం కూడ మంజూరు చేయబడింది. ఆచరణలో ఎదురయ్యే చిక్కులు మందు దొరకక పోవడంవంటి వాటి

కారణంగా ఈ పని పూర్తి చేయడానికి వీలులేక పోయింది. అందువల్ల ఈ పదుపతి ఉద్యమాన్ని పైజిల్లాలో కొనసాగించడానికి, మాసూచాలు టీకాల ఉద్యమం ఈ సంవత్సరం పూర్తి కాగలదని ఆశింపబడుతున్న కృష్ణానదికి ఉత్తర భాగపు జిల్లాలలో కూడా ప్రారంభించడానికి తలపెట్ట బడింది. ఈ పథకాని అమలు పరచేందుకు 1959—60 ప్రణాళికలో రూ 1 95 లక్షల మొత్తం కేటాయించ బడింది, అందులో రు. 0.297 లక్ష ఈ జిల్లాకు ప్రత్యేకించ బడింది,

## క్లినికల్ లేబరేటరీలు

రసాయనిక పరీక్షలద్వారా సకాలంలో వ్యాధులనుకనిపెట్టి నిర్ధారణ చేయడం కోసం జిల్లా ప్రధాన పశువైద్య ఆసుపత్రులలోను పశుగణ క్షేత్రాలలోను ప్రతిచోట క్లినికల్ లేబరేటరీలను స్థాపించడానికి తలపెట్టబడింది. 1957—58 లో విశాఖపట్నం, కాకినాడ, నెల్లూరు, చిత్తూరు కర్నూలు హెడ్‌క్వార్టర్సు ఆసుపత్రులలో 5 క్లినికల్ లేబరేటరీలు తెరవబడ్డాయి. 1959—60 లో పశ్చిమ గోదావరి, కృష్ణా, అనంతపురం జిల్లాలలో మరి మూడు క్లినికలు లేబరేటరీలను ప్రారంభించడానికి, ఇంతకుమును పే స్థాపించబడిన పాత లేబరేటరీలను కొనసాగించడానికి తలపెట్ట బడింది. అందుకు ప్రణాళికలో రూ. 0.89 లక్ష మొత్తం కేటాయించ బడింది. అందులో, రూ. 0.240 లక్ష మొత్తం ఈ జిల్లాకు ప్రత్యేకించ బడింది.

## సంచార పశువైద్యశాలలు, ప్రథమ చికిత్సా కేంద్రాలు, చిన్న తరహా పశువైద్య శాలలు పశు వైద్యశాలలు

గ్రామీణ ప్రాంతాలలోను, పట్టణ ప్రాంతాలలోను పశువులకు ఉత్తమంగా వైద్య సహాయాన్ని కలుగ చేయడానికి, అంటువ్యాధులను కట్టుదిట్టంగా నివారించడానికి కూడా ఈ పథకాలు ఉద్దేశింప బడ్డాయి. 1959—60 సంవత్సరంలో ఇది వరకే ప్రారంభించ బడిన పాత వైద్యశాలలను, సంచార వైద్యశాలను, ప్రథమ చికిత్సా కేంద్రాలను కొనసాగించడమే కాకుండా ఈ జిల్లాలో

రూ. 0.315 లక్ష వ్యయంతో, 7 ప్రథమ చికిత్సా కేంద్రాలను, ఒక చిన్న తరహా పశువైద్యశాలను, ఒక పశువైద్యశాలను ప్రారంభించడానికి, ఇదివరకే ప్రారంభించిన పశువైద్య శాలలను, సంచార దళాలను, ప్రథమ చికిత్సా కేంద్రాలను కొనసాగించటానికి తలపెట్టబడింది.

### పెద్ద తరహా పశువైద్యశాలల్లో లోయర్ డివిజను గుమస్తాల నియామకం

1958—59 లో నియమించబడిన 9 లోయర్ డివిజను గుమస్తాల ఉద్యోగాలను కొనసాగించడానికి 1958—60 ప్రణాళికలో రూ. 0.08 లక్ష మొత్తం కేటాయించ బడింది. అందులో రూ. 0.01 లక్ష ఒక లోయరు డివిజను గుమాస్తాను కొనసాగించడానికి ఈ జిల్లాకు కేటాయించ బడింది.

### పందుల పెంపకం

ఈ పథకం క్రింద, ఆంధ్ర ప్రాంతంలో మూడు పందులపెంపకపు అభివృద్ధి శాఖలతో ఒక ప్రాంతీయ పందుల పెంపకపు యూనిటు జాతి పందుల పెంపకం కోసం స్థాపించ బడింది. ఈ యూనిటు లాభదాయకమైన పందుల పెంపకం గురించి రైతులకు తెలియ జెప్పడానికి ఒక నమూనా కేంద్రంగా పని చేస్తుంది. 1959—60 లో ఆంధ్రలో మరి 6 పందుల పెంపకపు అభివృద్ధి శాఖలను స్థాపించడానికి తలపెట్ట బడింది. అందులో ఒక శాఖ ఈ జిల్లాలో స్థాపించ బడుతుంది. అందుకోసం రూ. 0.10 లక్ష మొత్తం కేటాయించ బడింది.

## అడవులు

### అడవుల పునరుద్ధరణ

ఆటవీశాఖ స్వాధీన పరచుకొన్న ఎస్టేటు, పంచాయతీ అడవుల ఉత్పాదక శక్తిని పెంపొందించే ఉద్దేశంతో ఆ ప్రాంతాల్లో పునరుద్ధరణ క్షేత్రాలు వేయబడ్డాయి. ఈ సంవత్సరంలో ఈ జిల్లాలో వెయ్యి ఎకరాల మేర పునరుద్ధరణ క్షేత్రాలు వేయడానికి పాత క్షేత్రాలను నిర్వహించడానికి రూ. 0.30 లక్ష మొత్తం కేటాయించ బడింది.

### కలప రవాణా నియమావళి

కలపను దొంగ రవాణా చేయకుండా నివారించడానికిగాను కలపను ఒక చోటనుండి మరొక చోటకు చేర వేయడం మీద కట్టుదిట్టమైన పర్యవేక్షణ జరప డానికి ఈ పథకం ఉద్దేశింపబడింది. 1959–60 లో ఆంధ్రప్రాంతపు డివిజన్లు అన్నిటి లోను 80 మంది తానాదార్లు నియమించ బడతారు. ఇందుకు ప్రణాళికలో రూ. 0·35 లక్ష మొత్తం కేటాయించ బడింది. ఆ మొత్తంలో రూ. 0.018 లక్ష మొత్తం ముగ్గురు తానాదార్ల నియామకానికిగాను ఈ జిల్లాకు కేటాయించ బడింది.

# మత్స్య పరిశ్రమ

### అధికంగా చేపపిల్లలను సేకరించడం, పంపిణీ చేయడం

చేప పిల్లలను, అందులోను త్వరితంగా పెరిగే వాటిని, అవి సమృద్ధిగా దొరికే గోదావరి కృష్ణానదుల నుండి, తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి, కృష్ణా గుంటూరు డెల్టా జిల్లాలలోని నీటిపారుదల కాలవల నుండి సేకరించి మత్స్య ఉత్పత్తిని అధికం చేయడానికిగాను రాజ్యంలోనే జలాశయాల్లో నిల్వ చేయుదానికి ఈ పథకం ఉద్దేశిస్తున్నది 1957–58 లో కొంత అదనపు సిబ్బందిని నియ మించడమే కాకుండా, సేకరణ కేంద్రాలనుండి నిల్వచేసే ప్రాంతాలకు చేర వేసేందుకు 14 వ్యాన్లు కొన బడ్డాయి. ప్రస్తుతం ఉన్న సిబ్బందితోను వ్యాను లతోను, 1959–60 లో రెండు కోట్ల చేప పిల్లల్ని సేకరించడానికి తలపెట్ట బడింది. అందుకోసం, ప్రణాళికలో రు. 1.93 లక్షల మొత్తం కేటాయించ బడింది. అందులో రు. 0.25 లక్ష మొత్తం, 40 లక్షల చేప పిల్లల్ని సేకరించ డానికి ఈ జిల్లాకు కేటాయించబడింది.

### చేపల మార్కెట్లు

రాజ్యంలోని చేపల మార్కెట్లలో ఎక్కువ భాగం పారిశుద్ధ్యమనేదే లేని పరిస్థితులలో అసహ్యాకరంగా ఉండే ప్రదేశాలలో ఉన్నాయి. పరిశుభ్రంగా

చేపల మార్కెట్లను నిర్మించడం, నిర్వహించడం మామూలుగా లోకల్ బోర్డులు మున్సిపాలిటీల బాధ్యతే అయినప్పటికీ వాటి ఆదాయ మార్గాలు తక్కువగా, ఉండటంవల్ల వాటికి సబ్సిడీలను ఇచ్చి స్థానిక సంస్థలకు వాటి నిర్మాణం విషయం లో సహాయ పడడానికి తలపెట్ట బడింది. 1959–60లో ఆంధ్ర ప్రాంతాల్లో 5 పెద్ద చేపల మార్కెట్లను, 5 చిన్న వాటిని నిర్మించడానికి లోకలు బోర్డులకు, మున్సిపాలిటీలకు సబ్సిడీ ఇవ్వడానికి గాను రూ. 1.23 లక్షల మొత్తం కేటా యించ బడింది. అందులో ఈ జిల్లాలో ఒక మార్కెటుకు ప్రభుత్వం ద్రవ్య సహాయం చేస్తుంది.

## త్వరిత రవాణా సౌకర్యాలు

పట్టిన చేపలు ఎక్కువ భాగం చెడి పోకుండా నివారించే టందుకు 1957–59 లో 10 వ్యానులు, 2 క్యారియర్ పడవలు కొన బడ్డాయి, ప్రస్తుతం రవాణా సౌకర్యాలు లేని రోడ్డుమీద నడుపబడే ఈ వ్యానులతు ప్రతి సంవత్సరం అయ్యే ఖర్చుకోసం 1959–60 లో రూ. 1.00 లక్ష మొత్తం ప్రత్యేకించ బడింది. ఆ 14 వ్యానులలోను, రెండు వ్యానులు ఈ జిల్లాకు లభ్యమౌతాయి.

## క్రొత్త రకం నైలాను వలలు

ప్రస్తుతం బెస్తలు ప్రత్తితోను, జనుముతోను చేసిన వలలను వాడు తున్నారు. ఇవి అంతమన్నికగా లేవు. తరచు చేపలు వలలు తెంపుకుని పోవడం కూడా జరుగుతున్నది. తత్ఫలితంగా బెస్తలు వారు పడ్డ శ్రమకు తగిన ఫలితం పొందడం లేదు. నైలాను వలలు బాగా పని చేస్తున్నట్లు కనుగొన బడింది. అందువల్ల 200 నైలాను వలలను అసలు ఖరీదులో 33 1/3./.కు 59–60 లో బెస్తలకు పంపకం చేయడానికి ఉద్దేశింప బడింది. వీటి ఖరీదు చేపలు పట్టుని సీజను వదలి 5 సంవత్సరాల కాలపరిమితిలో తేలిక వాయిదాలలో వారి నుండి వసూలు చేయబడుతుంది. ఆ 200 వలలలో, 10 వలలు ఈ జిల్లాలో పంపిణీ చేయ బడతాయి.

## జెస్తవారికి దుంగల సరఫరా

పేదరికంవల్ల, దుంగల ఖరీదు అధికం కావడంవల్ల జెస్తలు తాము మొదట్నించి వాడుతున్న దుంగలు పాతవై పోయినప్పటికి క్రొత్తవాటిని కొనుక్కోలేక పోతున్నారు. అందువల్ల అసలు ఖరీదులో 75 శాతానికి 59–60 లో 320 దుంగలను ఈ పథకం క్రింద పంపిణీ చేయడానికి ఉద్దేశింప బడింది. ఈ ఖరీదు 5 సంవత్సరాల కాల పరిమితితో తేలిక వాయిదాల మీద వసూలు చేయబడుతుంది. అందులో 60 దుంగలు ఈ జిల్లాలో పంపిణీ చేయబడతాయి.

## పడవల నిర్మాణపు కేంద్రం

చిన్న పడవలను నిర్మించేందుకు ప్రస్తుతం రాజ్యంలో ఏవిధమైన నిర్మాణ కేంద్రంగాని లేదు. పడవలను ఎక్కువ చేయడం పడవలకు యంత్రాలను సమకూర్చడం వల్ల ఎక్కువగా కావలసిన పడవల అవసరాలను తీర్చడానికి, తూర్పు గోదావరి జిల్లాలో రూ. 1.60 లక్ష వ్యయంతో 1958–59 లో ఒక నిర్మాణ కేంద్రం నెలకొల్ప బడింది. ఈ సంవత్సరంలో రూ. 1.00 లక్ష మొత్తం, ఈ కేంద్రాన్ని నిర్వహించడానికి, 60 పడవలను తయారు చేయడానికి ప్రణాళికలో కేటాయించ బడింది. అందులో 8 పడవలు ఈ జిల్లాకు సరఫరా చేయబడతాయి.

# సహకారం, గిడ్డంగులు, మార్కెట్లు

## గ్రామీణ పరపతి సంఘాల విస్తరణ

ఇది కొనసాగుతూ వస్తున్న పథకం. అఖిల భారత గ్రామీణ పరపతి పరిశీలన సంఘం వారి సిఫార్సులకు అనుగుణంగా రాజ్యంలోని గ్రామీణ పరపతి సంఘాలను నిర్వహించడం, పటిష్టం చేయడం, విస్తరింప చేయడం ఈ పథకం యొక్క ఉద్దేశాలు. సహకార శాఖలో సిబ్బందిని పటిష్టం చేయడం, సెంట్రల్ బ్యాంకులు, పెద్ద తరహా సంఘాలు నియమించిన అదనపు పర్యవేక్షక, నిర్వాహకు సిబ్బందికయ్యే ఖర్చుకు ద్రవ్యసహాయం చేయడం ద్వారా రెండవ ప్రణాళిక యొక్క మొదటి మూడు సంవత్సరాలలో ఈ పథకం అమలు పరచబడింది.

సహకార సంఘాలను గ్రామీణ ప్రజలనాధారంగా చేసికొని నిర్వహించా లనే సహకార విధానానికి సంబంధించిన జాతీయాభివృద్ధి మండలి తీర్మానం దృష్ట్యా ఈ సంవత్సరంలో అదనంగా పెద్ద తరహా సంఘాలు గ్రామీణ బ్యాంకులు స్థాపించ బడవు. కాని ఆంధ్ర ప్రాంతంలో ప్రస్తుతం వున్న 500 చిన్న సంఘా లను పటిష్ఠం చేయడమే కాకుండా కొత్తగా 350 చిన్న సంఘాలను కూడ ఏర్పాటుచేయడానికి ఉద్దేశింప బడింది నూటికి 82 గ్రామాలు, నూటికి 38 మం ది గ్రామీణ ప్రజలు ఈ పథకం క్రిందకు ఈ సంవత్సరం తీసికొనిరాబడతారు. స్వల్ప కాలిక, మధ్యకాలిక ఋణాలు కూడా ఇవ్వబడతాయి. రూ. 1,020 లక్షల వరకు స్వల్ప కాలిక ఋణాలు, రూ. 100 లక్షల వరకు మధ్య కాలిక ఋణాలు ఇవ్వబడతాయి. పరిపాలనశాఖనుండి ఆడిటుశాఖను వేరు చేయాలనే పథ కాన్ని అమలు పరచడానికి కూడా ఈ సంవత్సరం ఉద్దేశింప బడింది. రిజిస్ట్రారుకు ఆర్థిక సలహాదారు అని వ్యవహరింప బడే ఒక జాయింటు రిజిస్ట్రారు కూడా హెడ్ క్వార్టర్సులో నియమించ బడతారు ఆయన గ్రామీణ పరపతి పథకం పై ప్రత్యేకంగా ఆజ్మాయిషీ వహిస్తారు.

ఈ జిల్లాలో అమలు జరుపబడే కార్యక్రమం క్రిందివిధంగా ఉంటుంది. 30 క్రొత్త చిన్న తరహా సంఘాలు ఏర్పాటు చేయబడతాయి. ప్రస్తుతమున్న 33 చిన్న తరహా సంఘాలను పటిష్ఠం చేయడం, పాతసంఘాలలో 10,700 సభ్యులను, క్రొత్త సంఘాలలో 1500 మంది సభ్యులను చేర్పించడం, రూ. 180 లక్షల వరకు స్వల్పకాలిక ఋణాలను రూ 10 లక్షల వరకు మధ్య కాలిక ఋణాలను ఇవ్వడం జరుగుతుంది.

పై కార్యక్రమాన్ని అమలు పరచడానికి రూ. 39,748/ల మొత్తం ఈ జిల్లాకు కేటాయించ బడింది. ఆమొత్తం ఈ క్రింది విధంగా వినియోగింప బడుతుంది.

| | | రూపాయిలు |
|---|---|---|
| 1. | చిన్న తరహా సంఘాలకు సబ్సిడీలు | |
| | (ఏ) 1958–59 లో ప్రారంభించిన సంఘాలు | 2,500 |
| | (బి) 1959–60 లో ఏర్పాటు చేయబడే క్రొత్త సంఘాలు | 4,000 |

| | | |
|---|---|---|
| 2. | (ఏ) పెద్దతరహా సంఘాలకు సబ్సిడీ | 29,000 |
| | (బి) గ్రామీణ బ్యాంకులకోసం సీనియర్ ఇనస్పెక్టర్ల కయ్యే ఖర్చు | 8,000 |
| 3. | ఈ క్రింది వాటికిగాను సెంట్రల్ బ్యాంకులకు సబ్సిడీ. | |
| | (ఏ) ఇది వరకు నియమించ బడిన పాత సూపరు వైజర్లు | 3,000 |
| | (బి) 1959–60 లో నియమించ బడే క్రొత్త సూపరు వైజర్లు | — |
| 4. | అదనపు సిబ్బందికి ఖర్చు. | |
| | (ఏ) ప్రణాళికలోని మొదటి రెండు సంవత్సరాలలో నియమించబడ్డ క్రెడిట్ సీనియర్ ఇనస్పెక్టర్లు, జూనియరు ఇనస్పెక్టర్లు | 7,090 |
| | (బి) పైలట్ పథకం కోసం సిబ్బంది | 7,000 |
| | (సి) పరపతి కార్యక్రమంకోసం సహకార సబ్ రిజిస్ట్రార్లు | 4,200 |
| | (డి) సహకార సబ్ రిజిస్ట్రారులు (సి. డి.) క్లెపిస్టులు | 10,600 |
| | (ఇ) ఆడిటును వేరుచేయడానికి సిబ్బంది | 21,518 |
| | (ఎఫ్) 1959–60 లో డిప్యూటీ రిజిస్ట్రార్ల సర్కిళ్లలో ప్రతిదానిలోను నియమించ బడే ఒక్కొక్క జూనియరు ఇనస్పెక్టరు | 2,440 |
| | మొత్తం | 99,748 |

## భూమి తనఖా బ్యాంకుల అభివృద్ధి

భూమికి శాశ్వత అభివృద్ధిపనులు చేయడానికి, నీటిపారుదల సౌకర్యాలను ఏర్పాటు చేసుకోవడానికి, బాగు చేయడానికి తదితర పనులకు ప్రాథమిక భూమి తనఖా బ్యాంకుల ద్వారా 25 సంవత్సరాలలో చెల్లించుకో దగ్గ దీర్ఘ కాలిక ఋణాలును ఇవ్వడం ఈ పథకంయొక్క ఉద్దేశం. ఈ సంవత్సరం రు. **16.00** లక్షల వరకు ఈ జిల్లాలో దీర్ఘకాలిక ఋణాలు ఇవ్వబడతాయి. ఈ సంవత్సరం ఈ జిల్లాకు కేటాయించిన రు. 6,900 మొత్తం ఈ క్రింది విధంగా వినియోగింప బడుతుంది.

| | | రూపాయలు |
|---|---|---|
| 1 | ప్రణాళికలోని మొదటి మూడు సంవత్సరాలలో ప్రాథమిక భూమి తనఖా బ్యాంకులలో నియమించ బడిన అదనపు సూపరువైజర్లకయ్యే ఖర్చు. | 1,800 |
| 2 | ఈ సంవత్సరంలో నియమించబడే అదనపు సూపరు వైజర్లకయ్యే ఖర్చు. | 1,100 |
| 3 | భూమితనఖా బ్యాంకులపర్యవేక్షణకు కో-ఆపరేటివ్ సబ్ రిజిస్ట్రార్లకు, జవానులకు అయ్యే ఖర్చు. | 4,000 |
| | మొత్తం | 6,900 |

## సహకార పద్ధతులపై క్రయవిక్రయాల అభివృద్ధి

ఇది కొనసాగుతూ వస్తున్న పథకం. సహకార పద్ధతులపై వ్యవసాయో త్పత్తుల క్రయవిక్రయాలను అభివృద్ధి పరచడానికి ఉద్దేశింపబడింది. వ్యవసాయ దారులకు, ప్రత్యేకించి చిన్న రకం, మధ్య రకం ఉత్పత్తి దార్లకు ఈ పథకం క్రింద స్టోరేజి, గిడ్డంగి, మార్కెటింగు సౌకర్యాలు కలుగ చేయడమే ఈ పథకం యొక్క లక్ష్యం. క్రయ విక్రయ సంఘాల ద్వారా రసాయనిక ఎరువులను అవసర మయ్యే ఇతర పదార్థాలను సరఫరా చేయడమే కాకుండా వ్యవసాయోత్పత్తుల మీద రైతులకు స్వల్పకాలిక ఋణాలు కూడా

ఇవ్వబడతాయి. గ్రామ స్థాయిలో ప్రాథమిక వ్యవసాయ పరపతి సంఘాలకు, మండీ కేంద్రాలలో పనిచేస్తున్న మార్కెటింగు సంఘాలకు సన్నిహిత సంబంధాల్ని చేకూర్చడానికి కూడా ఈ పథకం క్రింద ఉద్దేశించ బడింది.

ఈ పథకం యొక్క పై ఆశయాలను సాధించడానికి రాజ్య ప్రభుత్వపు వాటాతోను, శిక్షణ పొందిన సిబ్బందితోను ప్రాథమిక క్రయవిక్రయ సంఘాలను. పునర్వ్యవస్థీకరించడానికి, పటిష్ఠం చేయడానికి రెండవ ప్రణాళికలో ఏర్పాటు చేయబడింది. అంతేకాకుండా మండీ కేంద్రాలలో పధాన గిడ్డంగులను గ్రామ స్థాయిలో సహాయక గిడ్డంగులను నిర్మించడానికి, ప్రత్తి జిన్నులు, నూనె మిల్లులు, చెరకుగానుగలు వంటి ప్రాసెసింగు యంత్రాలను స్థాపించటానికి, సంఘాలకు ఆర్థిక సహాయం చేయటానికి కూడ ఏర్పాటు చేయబడింది. ఈ సంవత్సరంలో ఈ జిల్లాలో అమలు జరుపబడే కార్యక్రమం ఈ క్రింద వివరింప బడింది.

| | | |
|---|---|---|
| 1. | వ్యవసాయోత్పత్తిపై ఋణాలను ఇవ్వడం (రూ. లక్షలలో) | 50.00 |
| 2. | క్రయవిక్రయ సంఘాలచే నిర్మించబడే గిడ్డంగులు (సంఖ్య) | 3 |
| 3. | పెద్ద తరహా సంఘాలచే నిర్మించబడే గిడ్డంగులు (సంఖ్య) | 3 |
| 4. | నెలకొల్పబడే ప్రాసెసింగు యంత్రాలు (సంఖ్య) | 1 |

పై కార్యక్రమాన్ని అమలు పరచడానికి ఈ జిల్లాకు రూ. 3.464 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఈ దిగువ తెలిపిన విధముగా ఆ మొత్తం వినియోగించ బడుతుంది.

| | | రూ. లక్షలలో |
|---|---|---|
| 1. | ప్రాథమిక క్రయ విక్రయ సంఘాలకు వాటా మూలధన విరాళం | 1.000 |
| 2. | జిల్లా క్రయవిక్రయ సంఘాలకు వాటా మూలధన విరాళం | 0.400 |

| | |
|---|---|
| 3. ప్రాథమిక క్రయవిక్రయ సంఘాలకు మేనేజీరియల్ సిబ్బందిని యామకానికి సబ్సిడీ. | — |
| (ఏ) గత 3 సంవత్సరాలలో సిబ్బందిని నియమించిన సంఘాలకు. | 0.060 |
| (బి) 1959–60 లో సిబ్బంది నియమించే సంఘాలకు. | 0.054 |
| 4. పెద్ద తరహా సంఘాలకు గిడ్డంగులు_ | |
| (ఏ) గత సంవత్సరాలలో ప్రారంభించిన గిడ్డంగుల నిర్మాణాన్ని పూర్తి చేయడానికి | 0.190 |
| (బి) 1959–60 లో ప్రారంభింప బోయే క్రొత్త గిడ్డంగులు. | 0.450 |
| 5. క్రయ విక్రయ సంఘాలచే గిడ్డంగులు. | |
| (ఏ) పాత గిడ్డంగులను పూర్తిచేయడానికి | 0.530 |
| (బి) క్రొత్త గిడ్డంగుల నిర్మాణానికి | 0.750 |
| 6. ప్రాసెసింగు యంత్రాల స్థాపనకు | 0.030 |
| మొత్తం. | 3.464 |

## లేబరు కాంట్రాక్టు, ఫారెస్టు కూపు సహకార సంఘాలు

రెండవ ప్రణాళికలో 15 లేబరు కాంట్రాక్టు, 15 ఫారెస్టుకూపు సహకార సంఘాలను నిర్వహించడానికి లేక పునరుద్ధరించడానికి ఈ పథకం ఉద్దేశిస్తున్నది. 1957–59లలో ఋణాలు, సబ్సిడీల రూపంలో ఆర్థిక సహాయం చేసి, రకానికి 5 సంఘాలు చొప్పున ఏర్పాటు చేయడం లేక అభివృద్ధి పరచడం జరిగింది. 1959–60 లో లేబరు, గ్రాంటుల రూపంలో ఆర్థిక సహాయం కలగ జేసి 5 ఫారెస్టు కూపు సహకార సంఘాలను, 6 లేబరు కాంట్రాక్టు సంఘాలను పునరుద్ధరించడానికి, పటిష్ఠం చేయడానికి ఉద్దేశింప బడింది. అందు

కోసం రూ. 0.47 లక్షు మొత్తం ఈ సంవత్సరపు ప్రణాళికలో కేటాయించ బడింది. అందులో రూ. 5,000లు రాజ్య స్థాయిలో నియమించ బడే సాంకేతిక సిబ్బందికయ్యే ఖర్చుకోసం ప్రత్యేకించ బడింది. మిగిలిన మొత్తం రూ. 0.42 లక్షలో రూ. 4,550లు ఆర్థిక సహాయం చేయడానికి ఈ జిల్లాలో వినియోగింప బడతాయి. ఈ మొత్తం ఒక ఫారెస్టు కూపు సంఘాన్ని పునరుద్ధరించడానికి గాను గ్రాంటుగా రూ. 1,200 ఋణంగా రూ. 3,350లు ఇవ్వబడతాయి.

## పరిశోధన, పరిశీలన, గణాంక వివరాలు

ఈ పథకం క్రింద సహకార శాఖలో ఒక ప్రత్యేక విభాగం ఏర్పాటు చేయబడుతుంది. సహకారశాఖ ద్వారా అమలు జరుప బడ్డ వివిధ పథకాలవల్ల ప్రజలకు కలిగిన లాభాలను, ఆ పథకాల నిర్వహణలో తెలియ వచ్చినలోటు పాట్లను పరిశీలించటానికి, సూత్రవిధానాలను రూపొందించటానికి, ఏవైనా లోటు పాట్లు ఉంటే వాటిని సరిదిద్దు కొనేటందుకు. మార్గాలను సూచించటానికి ఈ విభాగం కృషి చేస్తుంది. 1957–58 లో ఈ పథకం అమలు జరుప బడింది. దాని ననుసరించి జిల్లాలలో గణాంక వివరాలను సేకరించి, సంకలనం చేయ డం కోసం 20 మంది సీనియరు ఇనస్పెక్టర్లను నియమించటం, ప్రధాన కార్యాలయంలో ఒక సెక్షను ఏర్పాటు చేయడం జరిగింది. ఈ పథకం 1958–59లో కూడా కొనసాగించ బడింది.

1959–60లో, జిల్లాలలోని సిబ్బందికి సలహాలనిచ్చి, ఆజ్ఞాయిషీ వహించ డం కోసం రిజిస్ట్రారు గ్రేడులో ఒక స్టాటిస్టీషియనును, ఇద్దరు సీనియరు ఇన్స్పెక్టర్లను, ఇద్దరు జూనియరు ఇన్స్పెక్టర్లను, ఇద్దరు జవానులను, క్రొత్త సర్కిళ్ళకోసం 12 మంది సీనియర్ ఇన్స్పెక్టర్లను, ఒక్కొక్క సర్కిలు ఆఫీసుకు ఒక్కొక్కరు చొప్పున 46 మంది లోయరు డివిజను గుమాస్తాలను నియమించడానికి ఉద్దేశింప బడింది. క్రొత్త విధానాలను రూపొందించడానికి, వాటిని అమలు పెట్టడానికి, కార్యక్రమాన్ని ఏర్పాటు చేయడానికి వీలుగా ఉండేటందుకు సహకార శాఖలో పరిశోధన పరిశీలన ప్రచార విభాగం కూడా నెలకొల్ప బడింది. ప్రారంభంలో ఈ విభాగానికి ముగ్గురు సహకార బ్స

రిజిస్ట్రార్లు, ముగ్గురు జవానులతో కూడిన కొద్దిపాటి సిబ్బందిని నియమించడానికి ఉద్దేశింప బడింది. పై కార్యక్రమాన్ని అమలు పరచడానికి ఈ సంవత్సరపు ప్రణాళికతో రూ. 1.70 లక్షల మొత్తం కేటాయించ బడింది. అందులో రూ. 0.34 లక్ష, హెడ్ ఆఫీసులో నియమించడానికి ఉద్దేశింప బడిన సిబ్బందికి అయ్యే ఖర్చు క్రిందా ప్రచారం మొదలైన వాటి కయ్యే ఖర్చు క్రిందా ప్రత్యేకించ బడింది. మిగిలిన రూ. 1.36 లక్షల కేటాయింపులోను రూ. 6,044ల మొత్తం ఈ జిల్లాలో నియమించ బడే సిబ్బంది ఖర్చు క్రింద కేటాయించ బడింది.

## సభ్యులు, పంచాయతీదారులు మొదలైన వారికి శిక్షణ

ఈ పథకం, అఖిల భారత సహకార సమాఖ్య ద్వారా భారత ప్రభుత్వం వారు ప్రారంభించిన పథకపు పద్ధతిమీద రూపొందించ బడింది. సహకార సూత్రావళి, వాటి ఆచరణ, లెక్కలను వ్రాసి యుంచడం, సంస్థల నిర్వహణ మొదలైన విషయాలలో రెండు మూడు రోజులపాటు గ్రామీణ పరపతి సంఘాల సభ్యులకు, సుమారు ఒక వారం రోజులు పంచాయతీ దారులకు సుమారు 5 నుండి 6 వారాల పాటు సంఘాల కార్యనిర్వాహకులకు, జీతం మీద పనిచేసే ఉద్యోగులకు శిక్షణ ఇవ్వడానికి ఈ పథకం ఉద్దేశిస్తున్నది. 1959–60 లో ఈ జిల్లా లోని 1000 మంది సభ్యులకు, 300 మంది పంచాయతీదారులకు, 40 మంది కార్య నిర్వాహకులకు శిక్షణ ఇచ్చేందుకు రూ. 5856 ల మొత్తం కేటాయించ బడింది.

## సహకార వ్యవసాయం

సహకార వ్యవసాయ సంఘాలను ఏర్పాటు చేయడం ద్వారాను వాటా మూల ధనానికి, ఎద్దుల కొనుగోలుకు భూమిని బాగు చేయడానికి, వ్యవసాయ పనిముట్ల కొనుగోలుకు ఋణాలు, గ్రాంటుల రూపంలో ఆర్థిక సహాయాన్ని కలుగ జేయడం ద్వారాను భూములేని పేద రైతులకు పునరావాసం కల్పించ డానికి ఈ పథకం క్రింద ఉద్దేశింప బడినది. ఈ సంవత్సరపు ప్రణాళికలో ఆంధ్ర ప్రాంతానికి రూ. 1.34 లక్షలు, తెలంగాణా ప్రాంతానికి రూ. 0.88 లక్ష,

మొత్తం రూ. 2.22 లక్షలు కేటాయించ బడ్డాయి. అందులో రూ. 0.28 లక్ష మొత్తం, సహకార వ్యవసాయానికి సంబంధించిన పనికోసం ప్రధాన కార్యాలయంలో నియమింప బడిన సిబ్బందికయ్యే ఖర్చు క్రింద వినియోగింప బడుతుంది. మిగిలిన మొత్తంలో రూ. 13,500 ఈ జిల్లాకు కేటాయించ బడినాయి. అందులో రూ. 7,000, ఇంతకు ముందు ఏర్పాటు చేయబడిన సంఘాలలో నియమించ బడిన సిబ్బంది ఖర్చు క్రింద, రూ. 6,500 ఈ సంవత్సరంలో నిర్వహించ బోయే క్రొత్త సంఘాలకు ఆర్థిక సహాయాన్ని కలుగ చేయడానికి వినియోగింప బడతాయి. ఈ జిల్లాలో ఒక క్రొత్త సంఘం కొంత మంది సభ్యులతో ఏర్పాటు చేయ బడుతుంది. 1,000 ఎకరాల భూమి సాగు చేయ బడుతుంది.

## రాజ్య గిడ్డంగి కార్పొరేషను

దేశంలో గిడ్డంగులను అభివృద్ధి పరచాలనే విషయాన్ని గురించి అనేక కమిటీలు, కమీషన్లు నొక్కి చెప్పాయి. పరపతి, పరపతేతర సంఘాల కార్యకలాపాలకు సంబంధాన్ని కలుగచేసే ముఖ్యమైన సంస్థలే గిడ్డంగులు. అందువల్ల, భారత ప్రభుత్వం వారు కేంద్ర గిడ్డంగి కార్పొరేషను స్థాపించారు. దీనికి అనుబంధంగా రాజ్య ప్రభుత్వాలను తమ తమ రాజ్యాలలో గిడ్డంగి సంస్థలను ఏర్పాటు చేయ వలసిందిగా కేంద్ర ప్రభుత్వం వారు సలహా నిచ్చారు. ఇవి గిడ్డంగుల బోర్డు అధ్వర్యం క్రింద పని చేస్తాయి. గిడ్డంగి రసీదులు నెగోషియబుల్ ఇన్‌స్ట్రుమెంట్లుగా పరిగణింప బడతాయి. వాటి నిధగా పెట్టుకొని బ్యాంకులు గిడ్డంగులలో వ్యవసాయ ఫలసాయాన్ని దాచుకొనే వారికి పరపతి సౌకర్యాన్ని కలుగ చేస్తాయి. అందువల్ల 1958–59 లో రాజ్య గిడ్డంగి కార్పొరేషను ఈ రాజ్యంలో స్థాపించ బడింది. కార్పొరేషనుకు వాటా మూలధనం క్రింద ప్రభుత్వం వారు రూ. 2.50 లక్షల మొత్తం పెట్టుబడి పెట్టారు. ఈ సంవత్సరంలో ఆంధ్ర ప్రాంతాలికలో రూ. 5 లక్షలు, తెలంగాణా ప్రణాళికలో మరొక రూ 5 లక్షలు ఈ కార్పొరేషనుకు వాటా మూలధనం క్రింది పెట్టుబడి పెట్టడానికి కేటాయించారు. ఈ పథకం క్రింది ప్రయోజనాలు ఈ జిల్లాలోని రైతులకు కూడా లభ్యమౌతాయి.

# జాతీయ విస్తరణ సేవా కేంద్రాలు, సామాజికాభివృద్ధి కేంద్రాలు

1959 మార్చి నెలాఖరుకు ఈ జిల్లాలో 6 మొదటిదశ బ్లాకులు, 2 రెండవదశ బ్లాకులు, రెండు సామాజికాభివృద్ధి బ్లాకులు; ఒక ప్రీ-ఎక్స్టెన్షన్ బ్లాకు ఉన్నాయి. వీటి మొత్తం వైశాల్యం 1883.57 చ. మై. ఈ బ్లాకుల్లో 641 గ్రామాలు ఉన్నాయి. ఇందు నివశించే జనాభా 933878, భారత ప్రభుత్వం వారి నిర్ణయం ప్రకారం 1959 ఏప్రిలు నుండి కేటాయించ దగ్గ ప్రతి బ్లాకు లోను వ్యవసాయ రంగంలో ప్రత్యేకంగా పూర్వ విస్తరణ (ప్రీ-ఎక్స్టెన్షన్) కార్యక్రమం ఒక సంవత్సరం పాటు అమలు జరిగి ఉండాలి. ఈ నిర్ణయాన్ని అనుసరించి ఈ జిల్లా లోని నిడదవోలు బ్లాకులో 1-4-58 నాడు పూర్వ విస్తరణ కార్యక్రమం ప్రారంభించ బడింది. 1-4-58 తేదీన పూర్వ విస్తరణ కార్యక్రమం ప్రారంభించిన బ్లాకు మొదటి దశబ్లాకుగా 1-4-59 వ తేదీన మార్చబడింది, ఇదికాక 1-4-1959 నాడే కొయ్యల గూడెం, చింతలపూడి, సామాజికాభివృద్ధి బ్లాకులు రెండవ దశ బ్లాకులుగా రూపొందాయి, 1959-60 లో ఈ రాజ్యానికి 36 పూర్వవిస్తరణ బ్లాకులు కేటాయించ బడ్డాయి. అందులో 18 బ్లాకులు 1-4-59 తేదీన, తక్కినవి 2-10-59వ తేదీన ప్రారంభించ బడ్డాయి, ఇందులో అత్తిలి, నరసాపురం బ్లాకులు ఈ జిల్లాలో ఉన్నాయి. అత్తిలి బ్లాకు 1-4-59 వ తేదీన, నరసాపురం బ్లాకు 2-10-59 వ తేదీన ప్రారంభించ బడ్డాయి. ఆ విధంగా ఈ జిల్లాలో 1-4-59 వ తేదీ నాటికి 5 మొదటిదశ బ్లాకులు, 5 రెండవదశ బ్లాకులు. ఒక సామాజికాభివృద్ధి బ్లాకు, రెండు పూర్వ విస్తరణ బ్లాకులు ఉన్నాయి.

ఈ జిల్లాలో సామాజికాభివృద్ధి కార్యక్రమాన్ని అమలు పరచడం కోసం ఋణాల క్రింద రూ. 6,63,600లు గ్రాంటు క్రింద రూ. 15,40,600 లు మొత్తం రూ. 22,04,200 లు ఈ సంవత్సరపు ప్రణాళికలో కేటాయించ బడాయి.

1-4-59 వ తేదీనాటికి ఈ జిల్లాలో వున్న బ్లాకులను చూపే పటం ఈ ప్రక్క పుటలో ఇవ్వబడింది

---

# పంచాయతీలను పటిష్ఠం చేయడం

## సిబ్బంది పథకం.

పంచాయతీలను పటిష్ఠం చేసే ఉద్దేశంతో పంచాయతీ పాలనకు సంబంధించిన పర్యవేక్షక సిబ్బందిని ఫీల్డుసిబ్బందిని 1958-59లో పునర్వ్యవస్థీకరించడం జరిగింది. జిల్లా పంచాయతీ ఆఫీసర్ల కార్యాలయాల్లోని సిబ్బందిని పెంచడంతో పాటు జిల్లా స్థాయిలో జిల్లా పంచాయతీ ఆఫీసరును, రెవిన్యూ డివిజను స్థాయిలో డివిజనల్ పంచాయతీ ఆఫీసరును, తాలూకా స్థాయిలో (బ్లాకు ప్రాంతాలు మినహా) డిప్యూటీ పంచాయతీ ఆఫీసరును, బ్లాకు స్థాయిలో పంచాయతీల ఎక్స్‌టెన్షన్ ఆఫీసర్లను ఏర్పాటు చేయడం ద్వారా ఈ పునర్వ్యవస్థీకరణ జరిగింది. 1959-60 ప్రణాళికలో రు 8.00 లక్షల మొత్తం కేటాయించ బడింది. అందులో రు. 0.120 లక్ష మొత్తం స్థానిక పరిపాలన శాఖ ఇన్స్‌పెక్టరు జనరలు కార్యాలయంలో నియమించబడ్డ అదనపు సిబ్బందిని కొనసాగించడానికి, రు. 0.191 లక్ష మొత్తం ఇన్స్‌పెక్టింగ్ ఆఫీసర్ల (పశ్చిమ, తూర్పు) కార్యాలయాలలో నియమించబడిన సిబ్బందిని కొనసాగించడానికి ప్రత్యేకించబడింది ఖర్చు ఎక్కువ జరిగే జిల్లాలకు పంచేటందుకు రు. 0.524 లక్ష మొత్తం స్థానిక పరిపాలన ఇన్స్‌పెక్టరు జనరలు వద్దవుంచ బడింది. మిగిలిన రు 7.165 లక్షల మొత్తంలో రు. 0.2815 లక్ష మొత్తం 1958-59లో ఈ జిల్లాలో నియమించబడిన సిబ్బందిని కొనసాగించడానికి కేటాయించబడింది.

## శిక్షణ పథకం.

ఈ పథకం క్రింద సామర్లకోట, రాజేంద్రనగరులలో వున్న రెండు ఎక్స్‌టెన్షన్ ట్రైనింగు సెంటర్లలో డిప్యూటీ పంచాయతీ ఆఫీసర్లకు, పంచా

## పశ్చిమగోదావరిజిల్లా

1.4.59 తేదీనాటికి ఉన్న సామూహికాభివృద్ధి ప్రాంతాలు




సూచన

- రాజ్యసరిహద్దు
- జిల్లాసరిహద్దు
- తాలూకాసరిహద్దు
- బ్లాకుసరిహద్దు
- బ్లాకుకేంద్రం
- మొదటిదశబ్లాకులు
- రెండవదశబ్లాకులు
- సామూహికాభివృద్ధిబ్లాకులు
- ప్రీ-ఎక్స్‌టెన్షన్ బ్లాకులు

యతీల ఎక్స్టెన్షన్ ఆఫీసర్లకు, డివిజనల్ పంచాయితీ ఆఫీసర్లకు పరిపాలన విషయాలలో శిక్షణ ఇవ్వడానికి ఉద్దేశింప బడింది. జట్టుకు 40 మంది ఉద్యోగులకు చొప్పున జట్లు జట్లుగా ఈ శిక్షణ ఇవ్వబడుతుంది, ఈ శిక్షణ సుమారు రెండు మాసాలపాటు ఇవ్వబడుతుంది. మొత్తం మీద సుమారు 390 మంది ఆఫీసర్లకు 1959–60 లో శిక్షణ ఇవ్వడానికి ఉద్దేశింప బడింది. అందుకు రు.2.90 లక్షల మొత్తం ప్రణాళికలో కేటాయించబడింది. ఈ జిల్లాలోని ఆఫీసర్లకు కూడా ఈ పథకం క్రింద శిక్షణ ఇవ్వబడుతుంది.

---

# విద్యుచ్ఛక్తి

## మాచ్ఖండ్ జలవిద్యుచ్ఛక్తి పథకం

[ బకాయి పథకాలు, క్రొత్త పథకాలు ]

1957–58 సంవత్సరానికి ముందుగా ఒక్కొక్కటి 17,000 కిలోవాట్ల శక్తిగల మూడు విద్యుచ్ఛక్తి ఉత్పాదక యంత్రాలు (జనరేటింగు యూనిట్లు) పని చేయడం జన ప్రారంభమయింది. ఒక్కొక్కటి 21,250 కిలోవాట్ల శక్తిగల మిగిలిన రెండు యూనిట్లను నెలకొల్పే పనికూడా 1957–58 లో ప్రారంభించ బడింది. 21,250 కిలోవాట్ల శక్తిగల అరవ ఉత్పాదక యంత్రంతో పాటు ఈ రెండు యూనిట్లు గూడా 1958–59 లో ప్రారంభింప బడతాయని మొదట్లో ఆశించడం జరిగింది. కాని మాచ్కండ్లో జరిగిన సమ్మె మూలంగా 21,250 కిలోవాట్ల శక్తిగల నాల్గవ యూనిట్ మాత్రమే 1959 జనవరి మాసంలో ప్రారంభించ బడింది. ఐదో యూనిట్ కూడా 1959–60 లో ప్రారంభించ బడుతుందని ఆశించ బడుతున్నది. ఆరవ యూనిట్టు స్థాపించడానికి సంబంధించిన పని, 4వ, 5వ యూనిట్ల స్థాపనతో పాటు ప్రారంభించ బడింది. 1959–60 లో అది ప్రారంభం అవుతుందనికూడా ఆశించ బడుతున్నది. జాలాపుట్ డాం సర్ప్లస్ కోర్సును పూర్తి చేయడానికి, 5వ, 6వ జనరేటింగు యూనిట్ల స్థాపనకు, చిన్న చిన్న ఇతర బకాయి పనులకు సంబంధించిన పనుల

కోసం 1959–60 సంవత్సరానికి ప్రణాళికలో రూ. 79.07 లక్షల మొత్తం కేటాయించ బడింది. రూ. 79.07 లక్షల మొత్తంలోను రూ. 5.42 లక్షల మొత్తం ఈ జిల్లాకు ప్రత్యేకించ బడింది. ఈ పథకం పూర్వపు ఆంధ్ర రాష్ట్రం లోని 7 జిల్లాలు—అంటే శ్రీకాకుళం, విశాఖపట్టణం, తూర్పు, పశ్చిమగోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరు జిల్లాలకు విద్యుచ్ఛక్తిని సరఫరా చేస్తున్నది.

## ఎగువ సీలేరు జల విద్యుచ్ఛక్తి పథకం

ప్రథమ దశక్రింద 60,000 కి.వా. శక్తిగల రెండువిద్యుచ్ఛక్తి ఉత్పాదక యంత్రాలను స్థాపించటం ద్వారా సీలేరు నది ఎగువ భాగం లో విద్యుచ్ఛక్తి ఉత్పాదనకు ఈ పథకం ఉద్దేశించ బడింది. ఈ పథకానికి సంబంధించిన వివరమైన పరిశీలన పూర్తిచేయ బడింది. క్యాంపులను, రాకపోకలకు రవాణా సౌకర్యాలను ఏర్పాటు చేసే ప్రాథమిక కార్యాలు అమలు జరుగుతున్నాయి. ఈ సంవత్సరం లోనే పథకపు పనిని ప్రారంభించడానికి ఉద్దేశింప బడింది. 1959–60లో కేటాయించ బడ్డ రూ. 73.00 లక్షల మొత్తం క్యాంపుల నిర్మాణం, పునాదులు త్రవ్వడానికి, మట్టిగట్లు మొదలైనవి వేయడం వంటి సివిలు పనులకే ప్రధానంగా ఉద్దేశించ బడింది. పై కేటాయింపులో రూ. 10.43 లక్షల మొత్తం ఈ జిల్లాకు ప్రత్యేకించ బడింది.

## గ్రామీణ విద్యుతీ కరణ

ఈ పథకం కేవలం గ్రామీణ విద్యుతీ కరణకే కాకుండా గరివిడిలోని ఫెర్రో మాంగనీసుఫ్యాక్టరీ, నాగార్జునసాగర్ కు సంబంధించిన పనులకుకూడ విద్యుచ్ఛక్తిని సరఫరాచేయడానికి ఉద్దేశింప బడింది. రూ. 10 లక్షలకు మించిన విస్తరణ పనులకు కూడ ఈ పథకం ఉద్దేశిస్తున్నది 1959–60లో ఆంధ్ర ప్రాంతంలోని 100 గ్రామాలవిద్యుతీకరణకు రూ. 100 లక్షల మొత్తం కేటాయించ బడింది. అందులోరూ. 10 లక్షల మొత్తం 10 గ్రామాల విద్యుతీకరణకు గాను ఈ జిల్లాకు కేటాయించబడింది.

# గ్రామీణ పరిశ్రమలు, చిన్న తరహా పరిశ్రమలు

## చిన్న తరహా పరిశ్రమలు

### వడ్రంగంలో శిక్షణ-ఉత్పత్తి కేంద్రాలు

వడ్రంగంలో స్థిరపడిన పని వారికి మేలు రకం పరికరాలను వాడడంలోను, మేలురకం పద్ధతులలో మంచిరకం కర్రసామాను తయారు చేయడంలోను శిక్షణ ఇవ్వడం కోసం 1956-57 లో శ్రీకాకుళం, ఏలూరు, గుంటూరు, నెల్లూరు, కడప, కర్నూలులలో 6 వడ్రంగపు శిక్షణ ఉత్పత్తి కేంద్రాలు స్థాపించ బడ్డాయి. వాటికోసం ప్రత్యేకంగా భవనాలు కట్టబడ్డాయి. ఈ కేంద్రాలు అశాశ్వత భవనాల్లోనే ప్రస్తుతం ఏర్పాటు చేయబడ్డాయి. ప్రతి కేంద్రంలోను 12 మందికి శిక్షణ నివ్వడానికి ఉద్దేశింప బడింది. శిక్షణకాలంలో నెలకు రూ. 30 చొప్పున స్టయిఫండు ఇవ్వడానికి కూడా ఏర్పాటు ఉంది. మొదటి 3 సంవత్సరాలలో 173 మంది అభ్యర్థులు 3 జట్టులుగా ఈ 6 కేంద్రాలలోను శిక్షణ పొందారు.

ఈ సంవత్సరపు ప్రణాళికలో రూ. 0.86 లక్ష మొత్తం ఈ కేంద్రాలను కొనిసాగించడానికి, 72 మంది అభ్యర్థులకు శిక్షణ ఇవ్వడానికి కేటాయించ బడింది. అందులో రూ. 0.16 లక్ష మొత్తం, ఈ జిల్లాలోని కేంద్రాన్ని కొన సాగించ డానికి, 12 మంది అభ్యర్థులకు శిక్షణ ఇవ్వడానికి ప్రత్యేకించ బడింది.

### కమ్మరంలో శిక్షణ-ఉత్పత్తి కేంద్రాలు

కమ్మరంలో స్థిరపడిన పని వారికి మేలు రకం పద్ధతుల్లో వ్యవసాయ పని ముట్లు, చేతి పనిముట్లు మొదలైన వాటిని మరమ్మత్తు చేయడంలోను, తయారు చేయడంలోను శిక్షణ గరపడానికి 1956-57లో ఉత్పత్తి శిక్షణ కేంద్రాలు స్థాపించ బడ్డాయి. అవి శ్రీకాకుళం, ఏలూరు, గుంటూరు, నెల్లూరు, కడప, కర్నూలులలో ఉన్నాయి. వాటి కోసం శాశ్వత భవనాలు కట్ట బడ్డాయి. వాటిలోనే ఈ కేంద్రాలను ప్రస్తుతం ఏర్పాటు చేయడం జరిగింది. ఒక్కొక్క కేంద్రంలోను ప్రతిసంవత్సరం 12 మంది అభ్యర్థులకు శిక్షణఇవ్వ బడుతుంది.

శిక్షణ పొందేకాలంలో వీరికి ఒక్కొక్కరికి రూ. 30ల చొప్పున ప్రతినెలా స్టయి ఫండు ఇవ్వబడుతుంది. శిక్షణ పొందే వారికి, శిక్షణ పూర్తి అయిన మీదట చిన్న చిన్నతయారీయూనిట్లను స్థాపించుకోడానికి లేక పారిశ్రామిక సహకార సంస్థలను నెలకొల్ప కోవడానికి వీలుకలుగ చేయబడుతుంది. మొదటిమూడు సంవత్సరాలలో ఇంతవరకు 175 మంది అభ్యర్థులు 3 బట్టులుగా ఈ 6 కేంద్రాలలో శిక్షణ పూర్తి చేశారు.

ఈ సంవత్సరంలో ఈ కేంద్రాలను కొనసాగించడానికి, 72 మంది అభ్యర్థులకు శిక్షణ గరపడానికి ప్రణాళికలో రూ. 0.89 లక్ష మొత్తం కేటాయించ బడింది. అందులో రూ. 0.15 లక్ష ఈ జిల్లాలో ఈ కేంద్రాన్ని కొనసాగించడానికి 12 మంది అభ్యర్థులకు శిక్షణ గరపడానికి వినియోగించ బడతాయి.

## ఏలూరులో తోళ్ళ పరిశ్రమ

ఇది పరిశ్రమకు, ఉత్పత్తికి సంబంధించిన పథకం. పాదరక్షలు తయారు చేసే యూనిట్టుతో ఏలూరులో ఒక నమూనా తోళ్ళకర్మాగారాన్ని స్థాపించడానికి ఈ పథకంక్రింద ఉద్దేశింప బడింది. ఆధునిక పద్ధతుల మీద తోలు వస్తువులను, పాద రక్షలను తయారు చేయడానికి, నెలకు రూ. 20 చొప్పున స్టయిఫండుతో అవృత్తి చేసే 20 మంది పనివారికి శిక్షణ ఇవ్వడానికి దీనిక్రింద తలపెట్టబడింది. పాదరక్షల విభాగం అద్దె భవనంలో 1958 మే నెల నుండి పనిచేస్తున్నది. ఇంతవరకు 20 మంది అక్కడ శిక్షణను పూర్తిచేసుకొన్నారు. పాద రక్షలకు, తోళ్ళు పదును పెట్టడానికి సంబంధించిన విభాగానికి కావలసిన స్థలం సేకరించ బడింది. శాశ్వత భవనాల నిర్మాణం త్వరలో ప్రారంభమవుతుంది. ఈ సంవత్సరపు ప్రణాళికలో భవనాల నిర్మాణానికి, తోళ్ళ పరిశ్రమకు కావలసిన యంత్రసామాగ్రి పరికరాలు కొననడానికి, పాదరక్షల కేంద్రాన్ని కొనసాగించడానికి రూ. 3.27 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఈ సంవత్సరంలో 20 మంది అభ్యర్థులు శిక్షణ పొందుతారు. ఈ కేంద్రంనుండి రాగల ఆదాయం రూ. 1,00 00.

## కడప, కొత్తగూడెంలో సాధారణ ఇంజనీరింగు

## వర్కు షాపులు

కడప, కొత్తగూడెంలలో రెండు సాధారణ ఇంజనీరింగు వర్కుషాపులను సమస్తసాధన సంపత్తితో నెలకొల్పడానికి ఈ పథకం క్రింద తలపెట్టబడింది ఆయిలు ఇంజన్లు, పంపులు, ఆటోమోబైల్లు మొదలైన వాటికి మరమ్మత్తుల కోసం, వ్యవసాయదారులకు, పారిశ్రామికులకు కావలసి వచ్చే చిన్న తరహా ఉపకరణాలు, వ్యవసాయ పనిముట్లు మొదలైనవాటిని తయారు చేయడానికి వీలుగా ఉండేటందుకు ఈ కేంద్రాలు ఉద్దేశింప బడినాయి. వర్కుషాపులకోసం ఈ రెండు చోట్ల భవనాల నిర్మాణం పూర్తిఅయింది. 1958—59 లో యంత్రాలు, పరికరాలు చేరాయి. ఈ వర్కుషాపులు 1959 ఏప్రిలు మాసం నుండి పనిచేయడం ప్రారంభమయింది. ఈ సంవత్సరపు ప్రణాళికలో రూ. 0.48 లక్ష మొత్తం కేటాయించ బడింది. అందులో రూ. 0.27 లక్ష ఈ జిల్లాలోని వర్కుషాపును నడపడంకోసం వినియోగించ బడుతుంది.

## పరిశ్రమలకు రాజ్యప్రభుత్వ సహాయ చట్టంక్రింద ఋణాలు

ప్రణాళికలోని మొదటి 3 సంవత్సరాలలో పరిశ్రమలకు ప్రభుత్వ సహాయ చట్టంక్రింద లఘు పరిశ్రమలకు ఋణాల రూపంలో రూ. 13.11 లక్షలమొత్తం పంచిపెట్ట బడింది. ఈ సంవత్సరంలో పరిశ్రమలకు ఋణాలుగా మరొక రూ 7 లక్షల మొత్తం ఇవ్వబడుతుంది. ఈ జిల్లాలోని పారిశ్రామికులకుకూడా ఈ పథకం క్రింద లాభం చేకూరుతుంది

## పారిశ్రామిక శాఖను పటిష్టం చేయడం

రెండవ ప్రణాళికా కాలంలో పరిశ్రమల శాఖలో పనిబాగా పెరిగింది. తత్ఫలితంగా రూ. 7.48 లక్షల వ్యయంతో డైరెక్టరు కార్యాలయంలోను జిల్లాలోనూ కూడా సిబ్బందిని పెంచడానికి ఉద్దేశింప బడింది. రెండవ ప్రణాళికలో ఈ మొత్తం కేటాయించబడింది. మొదటి మూడు సంవత్సరాలలో రూ.3.45

లక్షల మొత్తం వ్యయంతో అదనపు సాంకేతిక సిబ్బంది, మినిస్టీరియల్ సిబ్బంది కూడా నియమించ బడింది. ఈసంవత్సరంలో ఇంతకు ముందు నియమించ బడిన సిబ్బందిని కొనసాగించడానికి, మరికొంత అదనపు సిబ్బందిని నియమించడానికి ఆంధ్ర ప్రణాళికలో రూ. 2.25 లక్షల మొత్తం కేటాయించ బడింది.

### బ్లాకు ప్రాంతాల్లోని పారిశ్రామిక శాఖ ఎక్స్‌టెన్షన్ ఆఫీసర్ల, జీతాలు

బ్లాకుప్రాంతాలలో నియమించ బడిన పారి శ్రామిక శాఖ ఎక్స్‌టెన్షన్ ఆఫీసర్ల జీతాల క్రింద రెండవ ప్రణాళికలో రూ. 10.17 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఈసంవత్సరపుప్రణాళికలో ఇందుకోసం రూ. 8.00 లక్షల మొత్తం కేటాయించ బడింది.

### పారిశ్రామిక, వాణిజ్య శాఖఅసిస్టెంటు డైరెక్టర్లకు జీపులు

తలపెట్టిన అనేక పథకాలను త్వరితంగాను, కట్టుదిట్టంగాను అమలు పరచాలంటే అందుకు సంబంధించిన అధికారులు తరచు పర్యవేక్షణ జరపడం, సాంకేతిక సహాయం అందచేయడం అవసరం. ఈ అధికారులు త్వరితంగా పర్యటించడానికి వీలుగా వీరికి జీపులను సరఫరా చేయడం అవసరం అనిభావించ బడింది. 1958–59 చివరకు ఆంధ్రప్రాంతంలోని పారిశ్రామిక, వాణిజ్య శాఖ అసిస్టెంటు డైరెక్టర్లందరికి జీపులు ఇవ్వబడినాయి. ఈ సంవత్సరంలో రూ. 0.30 లక్షమొత్తం ఈజీపుల నిర్వహణకు కేటాయించబడింది. ఒకజీపుఈ జిల్లాలో అసిస్టెంటు డైరెక్టరు క్రింద ఉన్నది.

## హస్తకళలు

### ఏలూరులో ఉన్ని కేంద్రం

ఏలూరు ఉన్ని తివాసీల నేతకు ప్రసిద్ధిచెందినట్టిది. కానీమంచిరకం ఉన్ని దొరకక పోవడం వల్లతివాసీల నాణ్యం నానాటికి దిగజారి పోతున్నది. అందువల్ల ఉన్నిని ప్రోసెసుచేసి, అద్దకం చేయడానికిగాను కేంద్రం ఒకటి తివాసీలను నేసే వారికి నాణ్యమైన ఉన్నిసరఫరా చేసేటందుకు 1958–59లో ఏలూరులో

స్థాపించబడింది. ఈసంవత్సరం దానిని కొనసాగించడంకోసం రూ. 0.19 లక్షల మొత్తం ప్రణాళికలో కేటాయించ బడింది.

## నర్సాపురం లేసు పరిశ్రమ

ఈ పథకం నర్సాపురంలో లేసుపరిశ్రమ అభివృద్ధికి ఉద్దేశింపబడింది, రూ. 0.19 లక్షవ్యయంతో రెండవప్రణాళిక కాలంలో లేసుపనివారిని సహకార వ్యవస్థ క్రిందకు తీసుకొని రావడానికి దీనిక్రిందతలపెట్ట బడింది. రూ 0.10 లక్ష వ్యయంతో 1959–60లో ఈ పథకాన్ని అమలుపరచ డానికి తలపెట్ట బడింది. సుమారు రూ. 50,000ల విలువచేసే లేసు ఈ సంవత్సరంలో ఉత్పత్తి చేయబడు తుందని ఆశించ బడుతున్నది.

## క్రొత్తపథకాలు

ఈ సంవత్సరంలో రాజ్యస్థాయిలో హస్తకళలకు సంబంధించి ఈక్రింది క్రొత్త పథకాలు అమలు పరచబడతాయి. వీటివల్ల వచ్చేలాభాలు ఆంధ్రప్రాంతం లోని జిల్లాలన్నిటికీ లభిస్తాయి.

| పథకం పేరు | 1959–60లో కేటాయింపు (రూ. లక్షలు) |
|---|---|
| హస్తకళలలో ఉపయోగించేటందుకు దేవాలయాలలోని డిజైనులను కాపీ చేయటం. | 0.50 |
| విడివిడిగా ఉంటూ, సహకార సంఘాలుగా ఏర్పడ్డానికి వీలులేనిపనివారికి గ్రాంటులు,ఋణాలుఇవ్వటం, | 0.05 |

## ఏలూరులో తివాసీ పరిశ్రమకు సంబంధించిన ఉత్పత్తి సౌకర్యాల కేంద్రం

ఏలూరులో తివాసీ పరిశ్రమకు సంబంధించినట్టి అందరికీ అందుబాటులో ఉండే ఉత్పత్తి సౌకర్యాల కేంద్రం స్థాపన కోసం 1959–60 ప్రణాళికలో రూ. 0.02 లక్ష మొత్తం కేటాయించ బడింది.

## పట్టు పరిశ్రమ

### చింతలపూడి క్షేత్రానికి రీలింగు కేంద్రం, నీటి పారుదల సౌకర్యాలు

పశ్చిమ గోదావరి జిల్లాలోని చింతలపూడిలో ఉన్న పట్టు క్షేత్రానికి రీలింగు, నీటి పారుదల సౌకర్యాలను కలుగజేసే ఉద్దేశంతో 1958–59 లో ఈ క్షేత్రానికి మోటారుతో ఒక పంపుసెట్టు, రీలింగు యూనిట్టు ఏర్పాటుచేయబడినాయి. ఈ సంవత్సరంలో మరొక రూ. 0.05 లక్ష మొత్తం గత సంవత్సరం ఏర్పాటు చేసిన సౌకర్యాలను కొనసాగించడానికిగాను ఈ క్షేత్రం కోసం వినియోగింపబడుతుంది

### క్రొత్త పథకాలు

### పట్టు పరిశ్రమ ప్రాంతాలో ప్రచారం

పట్టు పరిశ్రమను గురించి ప్రచారం చేసేటందుకు పట్టు పరిశ్రమ ఉన్న ప్రాంతాల్లో ఈ పథకాన్ని అమలు పరచడం కోసం రూ. 0.01 లక్ష మొత్తం ప్రణాళికలో కేటాయించ బడింది.

### మొగల్తూరులో పీచు పరిశ్రమకు సంబంధించిన ఉత్పత్తి–శిక్షణ కేంద్రం

పశ్చిమ గోదావరి జిల్లాలోని మొగల్తూరులో ఉత్పత్తి–శిక్షణ కేంద్రం స్థాపించబడింది. కొబ్బరిపీచునుండి ఆధునిక పద్ధతులలో పీచు వస్తువులను తయారు చేయడంలో ఏటా 12 మంది అభ్యర్థులకు శిక్షణ ఇవ్వడానికి ఇది ఉద్దేశింపబడింది. శిక్షణ పొందే ప్రతివ్యక్తికీ నెలకు రూ. 20 స్టయిఫండు ఇవ్వబడుతుంది. 1957–58 లో రెండు జట్టులుగా 24 మంది అభ్యర్థులు శిక్షణ పొందారు. ఈ సంవత్సరపు ప్రణాళికలో రూ, 0,10 లక్ష మొత్తం ఈ కేంద్రాన్ని కొనసాగించడానికి మరొక జట్టు 12 మంది అభ్యర్థులకు శిక్షణ ఇవ్వడానికి కేటాయించ బడింది.

### గ్రామీణపరిశ్రమలు,

### బెల్లం, ఖండసారి పథకాలు

ఈ పథకం క్రింద మంచిరకం, బెల్లాన్ని ఖండసారిని తయారు చేసేటందుకు

రైతులు మేలురకం ఉపకరణాలను కొనుక్కోవడానికి గాను వడ్డీలేకుండా ఋణాలు ఇవ్వబడుతాయి. ఉత్పత్తి చేసే విధానాలు కూడా ప్రదర్శించి చూపబడతాయి, ఈ ఋణాలు 5 సంవత్సరాలలో వసూలు చేయబడతాయి. ఈ పథకం అనకాపల్లి, చోడవరం, రామచంద్రపురం, చిత్తూరు, హిందూపురం తాలూకాలలో మొదటి ప్రణాళికా కాలం (1955) లో అమలు పరచబడింది. బెల్లాన్ని, ఖండసారిని ఆధునిక పద్ధతులలో ఉత్పత్తి చేయడ లో శిక్షణ పొందిన ప్రత్యేక ఫీల్డు సిబ్బందిని నియమించి ఈ పథకం అమలు పరచబడింది. ఈ పథకం 1956–57, 1957–58 సంవత్సరాలలో కొన సాగించబడింది. కాని ఇది 1958–1959 లో అమలు పరచబడలేదు. ఈ సంవత్సరంలో, ప్రస్తుతం అమలు జరుగుతున్న ప్రదేశాంలో కొనసాగిస్తూ, శ్రీకాకుళం జిల్లా పాలకొండ పశ్చిమ గోదావరి జిల్లా తణుకు, కృష్ణా జిల్లా దివి, గుంటూరుజిల్లా రేపల్లె చిత్తూరు జిల్లా చంద్రగిరి తాలూకాలకు ఈ పథకాన్ని విస్తరింప చేయడానికి ఉద్దేశింపబడింది ఇప్పటికే ఈ పథకం క్రింద కు 30,000 ఎకరాల మేర వస్తుంది ఈ పథకం క్రింది కార్యక్రమాలను క్రొత్త ప్రాంతాలకు విస్తరింప చేయడం వల్ల మరో 32,650 ఎకరాల మేర ఈ పథకం క్రిందికి వస్తుంది. ప్రస్తుతం పారిశ్రామిక శాఖ అజ్మాయిషీ క్రింద ఉన్న ఈ పథకాన్ని 1955 నవంబరులో ఏర్పాటు చేయబడ్డ ఆంధ్రప్రదేశ ఖాదీ, గ్రామీణ పరిశ్రమలబోర్డు అజ్మాయిషీకి మార్చడానికి తలపెట్ట బడింది. ఈ పథకం కోసం ఈ సంవత్సరంలో రూ.6 00 లక్షల మొత్తం కేటాయించ బడింది.

## కుటీర పరిశ్రిమల ఋణాల్ల నియమావళి

## క్రింద ఋణ సహాయం

వడ్రంగం, కమ్మరం, నేత మొదలైన వివిధ కుటీర, గ్రామీణ పరిశ్రమలు చేసుకుంటున్న పనివారికి ఆర్థిక సహాయాన్ని కలగ చేయాలనే ఉద్దేశంతో రెండవ ప్రణాళిక మొదటి రెండు సంవత్సరాలలో ఋణాలుగా రూ. 1.64 లక్షల మొత్తం పంపిణీ చేయబడింది. 1958–59 లో ఈ పథకం అమలు పరచ బడలేదు. ఈ సంవత్సరంలో రూ. 2.00 లక్షల వరకు ఋణాలను ఇవ్వడానికి

తలపెట్ట బడింది. ఈ జిల్లాలోని పనివారికి కూడా ఈ పథకం క్రింద ఋణాలు ఇవ్వ బడతాయి.

### పారిశ్రామిక సహకార వ్యవస్థలు

గ్రామీణ పరిశ్రమలు అన్నీ ఏకమై, వాటిఉత్పత్తి విధానాలను మెరుగు పరచుకొని తద్వారా ఉత్పత్తిని అధికం చేసుకోవ డానికి వీలు కలగ చేయడమే ఈ పథకం యొక్క ఆశయం, ఇందుకోసం సహకార సంఘాల ద్వారా దంపుడు బియ్యం పరిశ్రమను అభివృద్ధి పరచడానికి 10 కేంద్రాలను ప్రారంభించడం, కలంకారి అద్దకం పరిశ్రమకు నిర్వహణ మూలధనం, సిబ్బంది చార్జీల క్రింద గ్రాంటులు ఇవ్వడం, మేలు రకం పనిముట్లను కొనుక్కోవడానికి గుంటూరు కమ్మరి పనివారి సహకార సంఘానికి ఆర్థిక సహాయాన్ని కలుగచేయడం. పరికరాలు మొదలైనవి కొనుక్కోవడానికి కుటీర పారిశ్రామిక సహకార సంఘాలకు సబ్సిడీలను ఇవ్వడం మొదలయినటువంటి పథకాలు రూపొందించ బడినాయి. ఇంతవరకు రూ. 2.72 లక్షల మొత్తం ఈ పథకం క్రింద ఖర్చు పెట్టబడింది. ఈ సంవత్సరంలో, ఈ పథకాన్ని కొనసాగించడానికి రు. 1.68 లక్షల మొత్తం కేటాయించబడింది. క్రొత్తగాఏర్పాటు చేయబడ్డ ఆంధ్ర ప్రదేశ్ ఖాదీ, గ్రామీణ పరిశ్రమల బోర్డు అజ్మాయిషీ క్రిందికి దీనిని మార్చడానికి ఉద్దేశింప బడింది.

---

## చేనేత పరిశ్రమ

### చేనేత పనివారి సంఘాలకు వాటా మూలధనం, నిర్వహణ మూలధనం క్రింద ఋణాలు

చేనేత కార్మికుల సంఘాలలో వాటాలు తీసికొని, సభ్యులు కావడానికి వీలు కలిగించే టందుకు చేనేత కార్మికులకు ఋణాల నివ్వడానికి ఈపథకం ఉద్దేశించ

బడింది. ఈ సంవత్సరపు ఆంధ్ర ప్రణాళికలో ఈ పథకం కోసం రూ. 2.25 లక్షల మొత్తం కేటాయించ బడింది. అందులో రూ. 0.25 లక్ష వాటా మూలధనం క్రింద అప్పులు ఇవ్వడానికి ఈ జిల్లాకు ప్రత్యేకించ బడింది. ఈ సంవత్సరం ఈ జిల్లాలో 400 క్రొత్త మగ్గాలు సహకార వ్యవస్థ క్రిందికి, తీసికొని రాబడతాయని, 50 లక్షల గజాల గుడ్డ ఉత్పత్తి చేయబడు తుందని ఆశించ బడు తున్నది.

## ఆంధ్ర చేనేత కార్మికుల సహకార సంఘం విస్తరణ

మరి కొన్ని విక్రియ కేంద్రాలను ప్రారంభించడం ద్వారాను చేనేత, బట్టల విషయంలో తీవ్రమైన ప్రచారం జరపడం ద్వారాను ఆంధ్రచేనేత కార్మికుల సహకార సంఘం కార్యకలాపాలను విస్తరింప చేయడానికి ఈ పథకం ఉద్దేశించబడింది. ఈ పథకం కోసం ఈ సంవత్సరంలో రూ. 0.31 లక్ష మొత్తం కేటాయించ బడింది. అందులో రూ. 0 33 లక్ష మొత్తం ఈ జిల్లాలో మరిమూడు విక్రయ కేంద్రాలను, ప్రారంభించ డానికి వినియోగించ బడుతుంది. ఈ సంవత్సరంలో 10 లక్షల చేనేత బట్ట డిపోల ద్వారా అమ్మబడు తుందని ఆశించ బడు తున్నది.

## ఉత్పత్తి విధానాల అభివృద్ధి, నిర్వహణ ఖర్చు

అందరికీనచ్చే డిజైన్లతో ఇంకా నాణ్యమైన మంచి రకాల బట్టను ఉత్పత్తి చేయడానికిగాను, చేనేత పరిశ్రమ సాంకేతిక నైపుణ్యాన్ని మెరుగుపరచే ఉద్దేశంతో ఈ పథకం, రెండవ ప్రణాళిక మొదటి మూడు సంవత్సరాలలో అమలు పరచ బడింది. స్టాండర్డు రీడ్లు. వార్పింగు మిషన్లువంటి ఆధునిక పరికరాలు చేనేత కార్మికులకు సరఫరా చేయబడ్డాయి. ఈ సంవత్సరం ఆంధ్ర ప్రణాళికలో రూ.4.80 లక్ష మొత్తం కేటాయించబడింది. అందులో రూ. 0.52 లక్ష చేనేత కార్మికులకు 60 స్టాండర్డు రీడ్లను, 8 వార్పింగు మిషన్లను, 60 స్లేలను, ప్రెస్ మిషనును సరఫరా చేయడానికి, బట్ట నాణ్యాన్ని పెంపొందించడం కోసం, నియమించబడిన ఇద్దరు సాంకేతిక సహాయకులను కొనసాగించడానికి గాను ప్రత్యేకించ బడింది.

## అద్దకం ఫ్యాక్టరీలు

ఈ సంవత్సరానికి ఆంధ్ర ప్రాంతం కోసం ఈ పథకానికి గాను చేయబడిన కేటాయింపు రూ. 0.14 లక్ష మొత్తంలోను రూ. 0.04 లక్ష, ఈ జిల్లాలో ప్రస్తుతమున్న అద్దకం ఫ్యాక్టరీని ఆధునిక అద్దకం యూనిట్టుగా మార్చటం కోసం ప్రత్యేకించ బడింది. సుమారు 2000 బేళ్ళ నూలుకు, ఈ యూనిట్టులో ఈ సంవత్సరం రంగువేయ బడుతుందని ఆశించ బడుతున్నది.

## ముదరా

చేనేత బట్టల విక్రయాన్ని పోత్సహించే టందుకు తద్వారా ఉత్పత్తిని పెంచేటందుకు ఆంధ్ర చేనేత సహకార సంఘం, ప్రాథమిక చేనేత కార్మికుల సహకార సంఘాల విక్రయ శాలలచే అమ్మబడే చేనేత వస్త్రాల అమ్మకం మీద ముదరా ఇవ్వబడుతుంది. అమ్మకం మీద రూపాయకు 6న.పైసలు, మామూలుగా ముదరా ఇవ్వబడుతున్నది. కాని సంఘాలలోనిల్వ ఉండి పోయిన సరకును విక్రయించడానికి వీలుగా అప్పుడప్పుడు ప్రత్యేక ముదరా కూడా ఇవ్వబడు తున్నది. ఈ సంవత్సరపు ప్రణాళికలో ఈ పథకం కోసం రూ. 35.00 లక్షల మొత్తం కేటాయించ బడింది, అందులో రూ. 2.00 లక్షలు ఈ జిల్లాలో ముదరా ఇవ్వడానికి వినియోగించ బడతాయి.

## కంబళి పరిశ్రమ

ఆంధ్రప్రాంతములో కంబళి పరిశ్రమను అభివృద్ధి పరచడానికి రూ. 2.00 లక్షల మొత్తం ఈ సంవత్సరపు ప్రణాళికలో కేటాయించబడింది. ఇందులో రూ. 0.28 లక్ష ఈ జిల్లాలో ప్రస్తుతంఉన్న కంబళినేత కార్మికుల సంఘాలను కొనసాగించడానికి ఈ జిల్లాకు ప్రత్యేకించ బడింది.

## చేనేత కార్మికుల గృహ వసతి,

చేనేత కార్మికులు ఆరోగ్యకరమైన, అనుకూలమైన పరిసరాలలో తమ పరిశ్రమను కొనసాగించ డానికి వీలు కలిగించే నిమిత్తం వారి గృహ

వసతి సౌకర్యాలను అభివృద్ధి చేయుటయే ఈ పథకం యొక్క లక్ష్యం ఆంధ్ర ప్రాంతంలోని గృహవసతి పథకాలకు ఈ పథకం క్రిందరూ, 5.04 లక్షల మొత్తం కేటాయించ బడింది ఇందులో రూ. 0.46 లక్ష మొత్తం ఈ జిల్లాలోని ఈ క్రింది పథకాలకోసం కేటాయించబడింది.

ఏలూరు గృహావసతి పథకం 30 ఇళ్ళు.

---

# రోడ్లు

## ప్రభుత్వ రోడ్లు (బకాయిపనులు)

ఆంధ్ర ప్రాంతములోని బకాయి రోడ్డు పనులను పూర్తి చేయడానికి 1959–60 లో రూ. 2,98 లక్షల మొత్తం కేటాయించ బడింది. అందులో రూ. 0,002 లక్ష ఈ క్రింది పనులనిమిత్తం ఈ జిల్లాకు ప్రత్యేకించ బడింది,

| వరుస సంఖ్య | పనివివరం | 1959–60 లో కేటాయింపు రూ, లక్షలలో |
|---|---|---|
| 1. | దేవులపల్లి–దూబచెర్ల రోడ్డుకు కంకర వేయడం | 0.001 |
| 2. | కొవ్వూరునుండి తాళ్లపూడివరకు గోదావరి కరకట్టను వెడల్పు చేయడం, కంకర వేయడం. | 0,001 |

## ప్రభుత్వరోడ్లు (క్రొత్త పనులు)

ఆంధ్ర ప్రాంతంలో ఈ పథకం కోసం 1959–60 సంవత్సరానికి రూ, 41.69 లక్షల మొత్తం కేటాయించ బడింది. అందులో రూ. 1,202 లక్షల మొత్తంఈ జిల్లాలోని ఈ క్రింది పథకాలకోసం ప్రత్యేకించ బడినాయి.

| వరుససంఖ్య | పనివివరం | 1959-60 లో కేటాయింపు రూ. లక్షలలో |
|---|---|---|
| 1. | కొయ్యలగూడెం—పోతవరం రోడ్డులో కంకర వేయని చోట కంకరవేయడంతో పాటు రోడ్డు పడని భాగాలలో రోడ్డు వేయడం. | 0.001 |
| 2. | మార్టేరునుండి పిప్పర వరకు 15 మైళ్ళు కోడేరు—నల్లజర్ల రోడ్డుకు తారువేయడం. | 0.290 |
| 3. | పామర్రు—పాలకొల్లు రోడ్డు లో మై. 59/5 వద్దనున్న వంతెన పునర్నిర్మాణం. | 0.010 |
| 4. | జి. ఎస్. టి. రోడ్డుకు గుండుగొలనునుండి ఏవ్వూరు వరకు తగురీచిలలో తారువేయడం, మై. 337/8 నుండి 338/1 వరకు డిప్ పేవ్‌మెంట్ చేయడం | 0.001 |
| 5. | పామర్రు—పాలకొల్లు రోడ్డు మై. 52/0—1 వద్ద గల ఓవర్ బ్రిడ్జికి కలుపు రోడ్డు వేయడం. | 0.100 |
| 6. | కోడేరు—నల్లజర్ల రోడ్డు మీద మారుటేరు, అత్తిలి, పిప్పర. చిలకంపాడు వద్ద పటిష్ఠంగాలేని బ్రాహ్మణ చెరువు వంతెనల పునర్నిర్మాణం. | 0.500 |
| 7. | నర్సాపురం, ప్రక్కిలంకరోడ్డుమీద వంతెనలు, కల్వర్టుల నిర్మాణం. | 0.300 |

ప్రభుత్వంవారు స్వాధీన పరచుకొన్న రోడ్ల స్థాయిని పెంచటం

ఆంధ్ర ప్రాంతంలో ఇదివరకే ప్రభుత్వంవారు స్వాధీనం చేసుకొన్న జిల్లా బోర్డు రోడ్ల స్థాయిని పెంచేటందుకు 1959—60 ప్రణాళికలో రూ. 20.00 లక్షల మొత్తం కేటాయించ బడింది. అందులో రూ. 1.80 లక్షల మొత్తం ఈ జిల్లాలోని ఈ క్రిందిరోడ్ల స్థాయిని పెంచేటందుకు ప్రత్యేకించబడింది.

| వరుస సంఖ్య | పథకం పేరు | రూ. లక్షలలో కేటాయింపు |
|---|---|---|
| 1. | చింతలపూడి నుండి అల్లిపల్లిమీదుగా మాదిసెట్టి వారి పాలెంపోయె రోడ్డుమీద వంతెనలు, కల్వర్టుల నిర్మాణం | 0.10 |
| 2. | దొమ్మేరు—లంకల కోడేరు రోడ్డుమీద జామెట్రిక్ ఫీచర్సుకు అభివృద్ధి పనులు. | 0.20 |
| 3. | తణుకు—అత్తిలి రోడ్డుపైన తారువేయడం. | 1.50 |

ఈ జిల్లాలోని ఈ క్రింది జిల్లా బోర్డురోడ్లను కూడా స్వాధీన పరచుకోవడానికి ఈ పథకం క్రింద తలపెట్ట బడింది.

| వరుస సంఖ్య | రోడ్డు పేరు | పొడవు మై. ఫ. అ. |
|---|---|---|
| 1. | దేవరపల్లినుండి గోపాలపురంకు పోవు రోడ్డు ఎం.డి.ఆర్. 0–0–0 నుండి 4–6–0 వరకు. | 4 – 6 – 0 |

## రోడు ప్రక్క చెట్లు

రోడ్డు ప్రక్క చెట్లను అభివృద్ధి పరచడానికిగాను ఈ సంవత్సరపు ప్రణాళికలో ఈ జిల్లాకు రూ, 0.04 లక్ష మొత్తం కేటాయించ బడింది,

## ఇతర రోడు (బకాయి పనులు)

మొదటి ప్రణాళికకు సంబంధించి పూర్తి చేయబడకుండ మిగిలిపోయిన పి. డబ్ల్యు. ఆర్. డి. పనులను పూర్తిచేయడానికిగాను ఆంధ్ర ప్రాంతంలోని జిల్లా బోర్డులకు పూర్తి గ్రాంట్లను ఇవ్వడానికి 1959–60 లో రూ. 15.00 లక్షల మొత్తం ఈపథకం క్రింద కేటాయించబడింది. అందులో రూ. 0.70 లక్ష ఈ జిల్లాకు ప్రత్యేకించబడింది.

## ఇతర రోడు (క్రొత్తవి,)

క్రొత్త పి. డబ్ల్యు. అర్, డి పనులు ప్రారంభించడానికి ఆంధ్రప్రాంతంలోని జిల్లాబోర్డులకు ఈ పథకం క్రింద సగం గ్రాంట్లు ఇవ్వబడతాయి. మిగిలిన సగం భాగాన్ని జిల్లాబోర్డులు, ఈ రోడ్లవల్ల లాభం పొందే ప్రజలు భరించాల్సి, ఉంటుంది. 1959–60 లో క్రొత్త పనులకుగాను ఆంధ్ర ప్రాంతంలోని జిల్లా బోర్డులకు గ్రాంట్లు ఇవ్వడంకోసం రూ. 6.00 లక్షల కేటాయించ బడ్డాయి, అందులో రూ. 0.45 లక్ష ఈ జిల్లాకు కేటాయించ బడింది.

## గ్రామ ప్రణాళికలలో రోడ్లు

ఈ పథకం క్రింద కల్వర్టులు, వంతెనల నిర్మాణం, క్రొత్తగా గ్రామాలలోను గ్రామాల మధ్య రోడ్లువెయడం జరుగుతున్నది. జిల్లా కలెక్టరు ఈ పథకం కింద చేయవలసిన పనులను నిర్ణయించి నిర్వహిస్తారు. ఆయ్యే ఖర్చులో సగం ప్రభుత్వంవారు భరిస్తున్నారు. మిగిలింది ఈ రోడ్లవల్ల లాభంపొందే ప్రజలు భరించాలి. 1959–60 లో ఈ పథకంమీద ఆంధ్ర ప్రాంతంలో రూ. 15.00 లక్షల మొత్తం ఖర్చు పెట్టడానికి ఉద్దేశింప బడింది. అందులో రూ. 0.978 లక్షల మొత్తం ఈ జిల్లాకు ప్రత్యేకించ బడింది.

## జాతీయ రహదారుల మళ్ళింపు పథకము: రాజ్యప్రభుత్వంవాటా

గోదావరి నది యొక్క రెండు శాఖలమీద వంతెనల నిర్మాణానికి తూర్పు, పశ్చిమ గోదావరి జిల్లాల మీదుగా మదరాసు, కలకత్తా రోడ్డు (జాతీయ రహదారి నెం. 5) మళ్ళింపుకి తలపెట్టబడిన ఈ పథకానికయే ఖర్చులో 1/8వ వంతు ఖర్చును భరించటానికి, భారత ప్రభుత్వం సూచించినట్టుగా తక్కువ జలదారితో కాక రాజ్య ప్రభుత్వం తలపెట్టినట్టుగా పూర్తి జల దారితో గోదావరి నది శాఖ అయిన గౌతమి మీద వంతెన కట్టుటకు అగు రూ. 10 లక్షల అదనపు ఖర్చును భరించటానికి రాజ్య ప్రభుత్వం అంగీకరించింది. ఈ పథకానికయ్యే ఖర్చుకు రాజ్య ప్రభుత్వ వాటాక్రింద 1959–60 ప్రణాళికలో రూ. 4.88 లక్షల మొత్తం కేటాయించ బడింది.

---

# విద్య

## ప్రాథమిక విద్య

ప్రాథమిక విద్యాభివృద్ధికోసం ఈ జిల్లాకు రూ. 9.558 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఆ మొత్తం ఈ క్రింది విధంగా వినియోగించటానికి ఉద్దేశింప బడింది.

### కొనసాగుతున్న పథకాలు

| వరుస సంఖ్య | పథకం పేరు. | కేటాయించ బడిన మొత్తం రూ. లక్షలలో |
|---|---|---|
| 1. | 1957–58 లో ప్రారంభించబడిన ప్రీ ప్రైమరీ/బేసిక్ పాఠశాలలు/సెక్షన్లు (ఒక సెక్షను) | 0.020 |
| 2. | 1958–59 లో ప్రభుత్వ బేసిక్ శిక్షణ పాఠశాలలకు చేర్చబడిన ప్రీ–బేసిక్ సెక్షన్లు (ఒక సెక్షను) | 0.020 |
| 3. | 1957–58 లో ప్రారంభించ బడిన ప్రీ ప్రైమరీ/బేసిక్ పాఠశాలలు/ఉపాధ్యాయులు/శిక్షణ పాఠ లలు (ఒక సెక్షను) | 0.060 |
| 4. | 1955–57 లలో తెరవ బడిన పాఠశాలలు, నియమించ బడిన అదనపు ఉపాధ్యాయులు. | |
| | - (ఏ) ప్రభుత్వానివి (సాంఘికసంక్షేమశాఖ) (3పాఠశాలలు) | 0.030 |
| | (బి) స్థానిక సంస్థలు (7 పాఠశాలలు). | 0.040 |
| 5. | 1957–58 లో తెరవ బడిన ప్రాథమిక పాఠశాలలు, నియమించ బడిన అదనపు ఉపాధ్యాయులు. | |
| | (ఏ) స్థానిక సంస్థలు (ఒక పాఠశాల) | 0.010 |
| 6. | 1958–59 లో ప్రారంభించ బడిన ప్రాథమిక పాఠ శాలలు, నియమించ బడిన అదనపు ఉపాధ్యాయులు. | |

(ఏ) స్థానిక సంస్థలు (4 పాఠశాలలు). 0.020

(బి) ఎయిడెడ్ (4 పాఠశాలలు). 0.030

7. 1957–58 లో ప్రారంభించ బడిన జూనియరు బేసిక్ పాఠశాలలు.

(ఏ) స్థానిక సంస్థలు (13 పాఠశాలలు). 0.200

(బి) ఎయిడెడ్ (10 పాఠశాలలు). 0.150

8. 1958–59 లో ప్రారంభించ బడిన జూనియర్ బేసిక్ పాఠశాలలు.

(ఏ) ప్రభుత్వానివి (సాంఘిక సంక్షేమశాఖ)
(బి) స్థానిక సంస్థలు (5 పాఠశాలలు)
(సి) ఎయిడెడ్ (5 పాఠశాలలు) 0.040

9. 1957–58 లో జూనియర్ బేసిక్ పాఠశాలలుగా మార్చ బడిన ప్రాథమిక పాఠశాలలు

(ఏ) ప్రభుత్వానివి (సాంఘిక సంక్షేమశాఖ)
(బి) స్థానిక సంస్థలు (18 పాఠశాలలు)
(సి) ఎయిడెడ్ (32 పాఠశాలలు). 0.006

10. 1958–59 లో జూనియర్ బేసిక్ పాఠశాలలుగా మార్చబడిన ప్రాథమిక పాఠశాలలు.

(ఏ) ప్రభుత్వానివి (సాంఘిక సంక్షేమశాఖ)
(బి) స్థానిక సంస్థలు
(సి) ఎయిడెడ్ (4 పాఠశాలలు). 0.002

11. ప్రాథమిక, మాధ్యమిక పాఠశాలలలోని ఉపాధ్యాయుల జీతాల హెచ్చింపుకు. 2.990

12. 1958–59 జిల్లా లో బోర్డులచే స్వాధీనం చేసుకో బడిన ఎయిడెడ్ ప్రాథమిక పాఠశాలలు 1.150

| | | |
|---|---|---|
| 13. | 1956–57 లో ప్రారంభించిన మాధ్యమిక పాఠశాలలు, అదనపు సెక్షన్లు. | |
| | (ఏ) ప్రభుత్వానివి (ఒక సెక్షను) | 0.020 |
| | (బి) స్థానిక సంస్థలు (10 సెక్షన్లు, 4 పాఠశాలలు) | 0.020 |
| | (సి) ఎయిడెడ్ (15 సెక్షన్లు) | 0.050 |
| 14. | 1957–58 లో ప్రారంభించిన మాధ్యమిక పాఠశాలలు, అదనపు సెక్షన్లు. | |
| | (ఏ) స్థానిక సంస్థలవి (13 సెక్షన్లు) | 0.130 |
| 15. | 1957–58 లో మాధ్యమిక పాఠశాలలుగా మార్చబడిన హైయ్యర్ ఎలిమెంటరీ పాఠశాలలు. | |
| | (ఏ) స్థానిక సంస్థలు (3 పాఠశాలలు). | 0.120 |
| 16. | 1958–59 లో ప్రారంభించిన మాధ్యమిక పాఠశాలలు, అదనపు సెక్షనులు (ప్రభుత్వానివి) (1 పాఠశాల 1 సెక్షను). | 0.100 |
| 17. | 1957–58, 1958–59 లో ప్రారంభించిన ప్రభుత్వ మాధ్యమిక పాఠశాలలకు భవనాలు, ఆటస్థలాలు. | 0.070 |
| 18. | పెంటపాడు ప్రభుత్వ పోస్టు బేసిక్ పాఠశాలకు, భవనాలకు. | 0.550 |
| 19. | 1958–59 లో కొన్ని ప్రభుత్వ శిక్షణ పాఠశాలలో ఉద్యోగ స్థాయి పెంచ బడిన ప్రధానోపాధ్యాయుల పదవులు | 0.010 |
| 20. | 1956–57 లో సెకెండరీ గ్రేడు శిక్షణ సెక్షన్లుగా మార్చబడిన హైయరు ఎలిమెంటరీ గ్రేడు ట్రైనింగు సెక్షన్లు. | 0.010 |

| | | |
|---|---|---|
| 21. | 1958–59 లో కొన్ని ప్రభుత్వ శిక్షణ పాఠశాలలో నియమించ బడిన డ్రాయింగు, హిందీ టీచర్లు (ఒక ఉపాధ్యాయుడు). | 0.020 |
| 22. | పెంటపాడు ప్రభుత్వ పోస్టు గ్రాడ్యుయేటు బేసిక్ శిక్షణ పాఠశాల | 0.290 |
| 23. | 1957–58 లో ఇన్‌స్పెక్టరేటులలో నియమించ బడిన గుమాస్తాలు (ఇద్దరు) | 0.010 |
| 24. | 1958–59 లో నియమించబడిన సీనియరు డిప్యూటి ఇన్‌స్పెక్టర్లు–జవానులతో సహా (ఇద్దరు) | 0.030 |
| 25. | 1958–59 లో ఇన్‌స్పెక్టరేట్లలో నియమించబడిన అప్పర్ డివిజను గుమాస్తాలు (ఒక గుమాస్తా) | 0.020 |
| 26. | 8వ ఫారం వరకు ఉచిత విద్యా పథకాన్ని అమలు పరచడానికి ఇన్‌స్పెక్టరేట్లలో నియమించ బడిన అప్పరు డివిజను గుమాస్తాలు (ఒక గుమాస్తా) | 0 010 |

క్రొత్త పథకాలు

| | | |
|---|---|---|
| 27. | విద్యావంతులలో నిరుద్యోగాన్ని నివారించడానికి పథకం | 1.090 |
| 28. | ప్రాథమిక పాఠశాలల్లో అదనపు ఉపాధ్యాయుల నియామకం (27గురు ఉపాధ్యాయులు) | 0.130 |
| 29. | ప్రాథమిక పాఠశాలలను జూనియరు బేసిక్ పాఠశాలలుగా మార్చడం. | |
| | (ఏ) స్థానిక సంస్థలు (21 పాఠశాలలు) | 0,060 |
| | (బి) ఎయిడెడ్ (7 పాఠశాలలు) | 0.020 |
| 30. | స్త్రీవిద్యకు కేంద్ర పథకం — హైయ్యర్ ఎలిమెంటరీ గ్రేడు, ట్రైనింగు పాఠశాల (రెండు పాఠశాలలు) | 0.360 |

31. 1958-59 లో మాధ్యమిక పాఠశాలలుగా మార్చబడిన హైయ్యర్ ఎలిమెంటరీ పాఠశాలలకు గ్రాంటులు (ఎయిడెడ్) (ఒక పాఠశాల) 0.060

32. మాధ్యమిక పాఠశాలలుగా మార్చబడిన హైయ్యర్ ఎలిమెంటరీ (ఎయిడెడ్) పాఠశాలలు (కాంపెన్సేటరీ గ్రాంటు) (ఒక పాఠశాల). 0.060

33. 1958-59 లో ప్రారంభించిన మాధ్యమిక పాఠశాలలకు, అదనపు సెక్షనులకు గ్రాంటులు.

(ఏ) ఎయిడెడ్ (4 పాఠశాలలు.) 0 010

(బి) స్థానికసంస్థలవి (14 పాఠశాలలు.) 0.370

34. మాధ్యమిక పాఠశాలల్లో అదనపు సెక్షను తెరవడం ఎయిడెడ్) (5 పాఠశాలలు) కాంపెన్సేటరీ గ్రాంటు. 0.050

35. బాలికలకోసం ప్రభుత్వ మాధ్యమిక పాఠశాలలను ప్రారంభించడం (తాడేపల్లిగూడెం, కొవ్వూరులలో రెండు పాఠశాలలు). 0.270

36. 1958-59 లో ప్రారంభించబడిన ప్రాచ్యవిద్యా మాధ్యమిక పాఠశాలలకు, అదనపు సెక్షన్లకు గ్రాంట్లు (ఎ) ఎయిడెడ్ (3 పాఠశాలలు). 0.050

37. ప్రభుత్వ పాఠశాలల్లో అదనపు (మాధ్యమిక) సెక్షన్లు ప్రారంభించడం (ఒక సెక్షను.) 0.020

38. పెంటపాడు ప్రభుత్వ పోస్టు బేసిక్ పాఠశాలలో రెండవ గ్రేడును ప్రారంభించడం. 0.090

39. పెంటపాడు ప్రభుత్వ పోస్టు గ్రాడ్యుయేటు బేసిక్ శిక్షణ కళాశాలకు అదనపు సిబ్బంది. 0.30

40. ప్రభుత్వ బేసిక్ శిక్షణ పాఠశాలలో అంబరుచర్ఖా

| | | |
|---|---|---|
| | పథకం (4 పాఠశాలలు.) | 0.010 |
| 41. | జిల్లా విద్యాశాఖాధికారులకు జీపులు (ఒక జీపు.) | 0.160 |
| 42. | అదనపు జిల్లా విద్యాశాఖాధికారుల నియామకం. | 0.290 |
| 43. | పెంటపాడు ప్రభుత్వ పోస్టు గ్రాడ్యుయేటు బేసిక్ ట్రైనింగ్ కళాశాలలో గ్రాడ్యుయేటు ఉపాధ్యాయులకు బేసిక్ రీట్రైనింగ్ కోర్సు. | 0.100 |
| | మొత్తం | 9.558 |

## సెకండరీ విద్య

సెకండరీ విద్య అభివృద్ధికోసం ఈ జిల్లాకు రూ. 2.904 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఈ మొత్తం ఈ క్రింది విధంగా వినియోగించ బడుతుంది.

| వ. సి. సంఖ్య | పథకం పేరు | కేటాయింపు మొత్తం (రూ. లక్షలలో) |
|---|---|---|
| 1. | 1956–57 లో ప్రారంభించ బడిన ఉన్నత పాఠశాలలు, అదనపు సెక్షన్లు (ఏ) ప్రభుత్వానివి (2 సెక్షన్లు) | 0.020 |
| | (బి) స్థానిక సంస్థలు (ఒక పాఠశాల, 7 సెక్షన్లు) | 0.050 |
| | (సి) ఎయిడెడ్ (2 సెక్షన్లు) | 0.010 |
| 2. | 1957–58 లో ప్రారంభించిన ఉన్నత పాఠశాలలు, అదనపు సెక్షన్లు. | |
| | (ఏ) స్థానిక సంస్థలు (12 సెక్షన్లు) | 0.020 |
| 3. | 1957–58 లో హైయ్యరు సెకండరీ పాఠశాలలుగా మార్చబడిన ఉన్నత పాఠశాలలు. | |
| | (బి) ఎయిడెడ్ (ఒక పాఠశాల) | 0.020 |

| | | |
|---|---|---|
| 4, | ఉన్నత పాఠశాలలకు బిల్డింగు గ్రాంట్లు | |
| | (ఏ) స్థానిక సంస్థలు | 0.050 |
| | (బి) ఎయిడెడ్ (ఒక పాఠశాల) | 0.020 |
| 5. | ఒక ఎయిడెడ్ హైయ్యర్ సెకండరీ పాఠశాలలకు భవనాలు | 0.030 |
| 6. | సెకండరీ పాఠశాలల్లో ఉపాధ్యాయుల జీతాల హెచ్చింపు | 0.680 |

## క్రొత్త పథకాలు

| | | |
|---|---|---|
| 7. | 1958–59 లో ప్రారంభించబడిన ఉన్నత పాఠశాలలకు అదనపు సెక్షన్లకు గ్రాంట్లు | |
| | (ఏ) స్థానిక సంస్థలు | 0.100 |
| | (బి) ఎయిడెడ్ | 0.050 |
| 8. | ప్రభుత్వ మాధ్యమిక పాఠశాలలను ఉన్నత పాఠశాలలుగా మార్చడం, సెకండరీ పాఠశాలల్లో ఆదనపు సెక్షన్లను ప్రారంభించడం | 0.010 |
| 9. | ఉన్నత పాఠశాలలను హైయ్యర్ సెకండరీ పాఠశాలలుగా మార్చడం | |
| | (ఎ) స్థానిక సంస్థలు ( 2 పాఠశాలలు) | 1.200 |
| | (బి) ఎయిడెడ్ (ఒక పాఠశాల) | 0.320 |
| 10. | ఉన్నత పాఠశాలలకు బిల్డింగు గ్రాంట్లు. | |
| | (ఏ) స్థానిక సంస్థలు | 0.050 |
| | (బి) ఎయిడెడ్ | 0.100 |
| 11. | ఉన్నత పాఠశాలలకు ఫర్నీచరు, పరికరాల గ్రాంట్లు | |
| | (ఏ) స్థానిక సంస్థలు | 0.100 |
| | (బి) ఎయిడెడ్ | 0.050 |
| 12. | 11, 12 తరగతుల్లో చదువుకొనే విద్యార్థులకు స్కాలరు షిప్పులు | 0.004 |

13. పౌర శిక్షణ కేంద్రాలు 0.020

మొత్తం 2.904

## యూనివర్శిటీ విద్య.

ఆంధ్ర ప్రాంతంలో యూనివర్శిటీ విద్య అభివృద్ధికోసం ప్రణాళిక మొదటి 3 సంవత్సరాలలో రూ. 34.64 లక్షల మొత్తం ఖర్చు చేయబడింది. ఈ సంవత్సరంలో ఆంధ్ర ప్రాంతానికి ప్రణాళికలో రూ. 24.56 లక్షల మొత్తం కేటాయించ బడింది. అందులో రూ. 1.09 లక్షల మొత్తం 4 ఎయిడెడ్ కళాశాలలలో 3 సంవత్సరాల డిగ్రీకోర్సును ప్రవేశపెట్టడానికిగాను ఈ జిల్లాకు ప్రత్యేకించ బడింది

## ఇతర పథకాలు.

ఇతర పథకాల పద్దు క్రింద ఈ జిల్లాలో రు. 0.74 లక్ష మొత్తం కేటాయించ బడింది. ఆ పథకాల వివరాలు ఈ క్రింద తెలుప బడ్డాయి.

| వరుస సంఖ్య. | పథకం పేరు, | కేటాయింపు మొత్తం రు. లక్షలలో. |
|---|---|---|
| | ఇతర పథకాలు | |
| 1. | ఎన్. సి. సి. ఎ. సి. సి. ల విస్తృతికి | 0.48 |
| 2. | బాల భటుల, గర్లు గైడ్ల ఉద్యమాభివృద్ధి | 0.02 |
| 3. | జిల్లా సాంఘిక విద్యాధి కారి కార్యాలయాలు (ఒ.ఓ టి) | 0 15 |
| | క్రొత్త పథకాలు. | |
| 4. | పంచాయతీ, ప్రైవేటు, సహకార, గ్రామ సంఘ, స్థానిక సంస్థల గ్రంథాలయాలకు గ్రాంట్లు. | 0.06 |

| | | |
|---|---|---|
| 5. | ఎన్.సి.సి. యూనిట్లుకు పరో మాడలింగు, షిప్పు మాడలింగు పరికరాల సరఫరా. | 0.01 |
| 6. | హిందీ ప్రేమీమండలుల గ్రంథాలయాలకు గ్రాంట్లు. | 0.01 |
| 7. | యువజన సంక్షేమ కార్య కలాపాలు. | 0.01 |
| | మొత్తం. | 0.74 |

ప్రభుత్వేతర సాంకేతిక విద్యాసంస్థలకు గ్రాంటు–ఇన్–ఎయిడ్

1959–60 నుండి ఆంధ్రవిశ్వవిద్యాలయం తణుకులో ప్రారంభించ దలచిన పాలి టెక్నిక్‌కు గ్రాంటు–ఇన్–ఎయిడ్ మంజూరు, చేయడానికి 1959–60 ప్రణాళికలో రూ 3లక్షల మొత్తం కేటాయించ బడింది. ఈ కళాశాల స్థాపన కయ్యే ఖర్చును భారతప్రభుత్వంవారు, విశ్వవిద్యాలయం వారు, రాజ్యప్రభుత్వం వారు ఒప్పందం చేసుకున్న నిష్పత్తి ప్రకారం భరిస్తారు.

---

# వైద్యం

## కాంపౌండర్లకు శిక్షణ

ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలకు, ఇతర వైద్య సంస్థలకు కావలసిన కాంపౌండర్ల కోసం, రెండవ ప్రణాళికా కాలంలో 495 మంది కాంపౌండర్లకు అదనంగా శిక్షణ గరపడానికి తలపెట్ట బడింది, జిల్లా కేంద్ర అసుపత్రుల లోను బోధన సౌకర్యాలుఉన్న ఇతర అసుపత్రులలోను గల 11 శిక్షణకేంద్రాలలో ఏటా 99 మందికి శిక్షణ ఇవ్వబడుతుంది. ఆవిధంగా 1956–57,58–59 సంవత్సరాల మధ్య 297 మంది కాంపౌండర్లకు శిక్షణ ఇవ్వబడింది. ఇంకా 99మంది కాంపౌండర్లకు శిక్షణ ఇచ్చేటందుకు ఈ సంవత్సరంలో రూ. 0.22 లక్ష మొత్తం ప్రత్యేకించ బడింది. ఇందులో రూ. 0.02 లక్షమొత్తం, ఏలూరులోని జిల్లాకేంద్ర

అసుపత్రిలో 9 మంది కాంపౌండర్లకు శిక్షణ ఇవ్వడానికి ఈ జిల్లాకు కేటాయించ బడింది.

## అదనపు మంత్రసానులకు శిక్షణ

90మంది అదనపు మంత్రసానుల శిక్షణ నిమిత్తం ఈ సంవత్సరపు ప్రణాళికలో రూ 1.26 లక్షల మొత్తం కేటాయించ బడింది అందులో 18మంది రూ 0.25 లక్ష వ్యయంతో ఈ జిల్లాలోని ఏలూరులో ఉన్న జిల్లా కేంద్ర ఆసుపత్రిలో శిక్షణ పొందుతారు.

## జిల్లా కేంద్ర ఆసుపత్రులకు అభివృద్ధి పనులు

రెండవ ప్రణాళిక యొక్క మొదటి మూడుసంవత్సరాలలో రూ 13.00లక్షల వ్యయంతో ఆంధ్రప్రాంతంలోని జిల్లాఆసుపత్రులకు అదనంగా భవనాలను పరికరాలను సిబ్బంది మొదలైన వాటిని సమకూర్చడంద్వారా అనేకమైన అభివృద్ధి పనులు చేయబడ్డాయి. ఈ సంవత్సరపు ప్రణాళికలో జిల్లా అసుపత్రుల అభివృద్ధికిగాను రూ.9.00 లక్షల మొత్తం కేటాయించ బడింది. అందులో రూ. 0.50 లక్ష మొత్తం ఏలూరులో ఉన్నజిల్లా ఆసుపత్రి అభివృద్ధిక్రింద వినియోగింపబడుతుంది.

## తాలుకా కేంద్రాలలో ఉన్న ఆసుపత్రులకు అభివృద్ధి పనులు

పడకల సంఖ్యను పెంచడం ద్వారాను అదనంగా భవనాలను నిర్మించడం ద్వారాను ఆంధ్ర ప్రాంతంలోని తాలుకా ఆసుపత్రులకు అభివృద్ధి పనుల క్రింద రూ.4.71 లక్షల మొత్తం రెండవ ప్రణాళికలోని మొదటి మూడు సంవత్సరాలలో ఖర్చు పెట్టబడింది. తాలుకా అసుపత్రుల అభివృద్ధి పనులకోసం ప్రణాళికలో రూ.1.60 లక్షల మొత్తం ఈ సంవత్సరంలో కేటాయించ బడింది. అందులో రూ.0.14 లక్ష మొత్తం పడకల సంఖ్యను పెంచేసందర్భంలో కొన్ని తాలుకా ఆసుపత్రులలో ఇదివరకే నియమించ బడిన సిబ్బందిని నిర్వహించడానికి, తణుకు, కొవ్వూరులలో ఉన్న తాలుకా అసుపత్రులను అభివృద్ధి చేయడానికి ఈ జిల్లాలో వినియోగించ బడుతుంది.

## లోకలు ఫండు ఆసుపత్రులను స్వాధీనం చేసుకోవడం

ఈ సంవత్సరపు ప్రణాళికలో ఈ పథకం కోసం రూ. 3.95 లక్షల మొత్తం కేటాయించ బడింది. అందులో రూ. 0 36 లక్ష మొత్తం 1957–59లో ప్రభుత్వం స్వాధీనం చేసుకొన్న నిడదవోలు అసుపత్రి నిర్వహణకు, ఈ సంవత్సరంలో చింతలపూడిలోని లోకలు ఫండు సంస్థలను స్వాధీన పరచుకొనడానికి గాను ఈ జిల్లాకు కేటాయించ బడింది.

## జిల్లా లేబరేటరీలు, ప్రాంతీయ లేబరేటరీలు

1957–59లలో స్థాపించ బడిన 2 ప్రాంతీయ లేబరేటరీలను, 2 జిల్లా లేబరేటరీలను నిర్వహించడమే కాకుండా, క్రొత్తగా రెండు జిల్లా లేబరేటరీలను స్థాపించటానికి ఈ సంవత్సరపు ప్రణాళికలో రూ. 0.72 లక్ష మొత్తం కేటాయించ బడింది. అందులో రూ. 0.10 లక్ష మొత్తం, 1958–59లో ఏలూరులో నెలకొల్పబడిన జిల్లా లేబరేటరీ నిర్వహణ కోసం ఈ జిల్లాకు ప్రత్యేకించ బడింది

## క్షయ చికిత్సా కేంద్రాలు

రెండవ ప్రణాళిక మొదటి 3 సంవత్సరాలలో ఆంధ్ర ప్రాంతంలో 10 క్షయ చికిత్సా కేంద్రాలు తెరవ బడ్డాయి. ఈ సంవత్సరంలో, ఇదివరకు తెరవబడిన వాటిని నిర్వహించడమే కాకుండా మరి 4 కేంద్రాలను ప్రారంభించడానికి తలపెట్ట బడింది. అందుకోసం 1959–60 ప్రణాళికలో రూ. 3.00 లక్షల మొత్తం కేటాయించ బడింది. అందులో రూ. 0.20 లక్ష మొత్తం, 1956–57లో ఏలూరు లోని జిల్లా కేంద్ర అసుపత్రిలో స్థాపించ బడిన క్షయ చికిత్సా కేంద్రాన్ని కొనసాగించడానికి కేటాయించ బడింది.

## కుటుంబ నియంత్రణ కేంద్రాలు

దేశంలోని జనాభా త్వరితంగా పెరిగి పోతున్నందు వల్లను, దేశంలోని సంపద పరిమితం కావడం వల్లను జనాభా పెరుగుదలను అరికట్టే సమస్యకు

ప్రాముఖ్యత ఏర్పడింది. ఇందుకోసం 13 ఆంధ్రలోను, 7 తెలంగాణాలోను మొత్తం 20 కుటుంబనియంత్రణ కేంద్రాలు 1957-58లలో నెలకొల్పబడ్డాయి. ఈ సంవత్సరంలో ఇంతకుముందు నెలకొల్పబడిన కేంద్రాలను నిర్వహించడమే కాకుండా మరొక 15కేంద్రాలను-ఆంధ్రలో 10, తెలంగాణాలో 5-నెలకొల్ప డానికి తలపెట్టబడింది. అందుకోసం 1959-60 ప్రణాళికలో రూ. 0.66 లక్ష మొత్తం కేటాయించ బడింది. ఇందులో రూ. 0.02 లక్ష మొత్తం 1957-58లో ఏలూరులో ప్రారంభించ బడిన కేంద్రాన్ని నిర్వహించడానికిగాను ఈ జిల్లాలో వినియోగించ బడుతుంది.

## సహాయక నర్సు-మంత్రసానులు

సహాయక నర్సు-మంత్రసానుల శిక్షణకోసం ఇదివరకుప్రారంభించబడిన అయిదు కేంద్రాలను నిర్వహించడానికి, ఈ సంవత్సరంలో మరి రెండు కేంద్రాలను ప్రారంభించడానికి గాను ఈ సంవత్సరం ప్రణాళిక లో రూ.0 78 లక్ష మొత్తం కేటాయించబడింది. ఇందులో రూ.0.10 లక్ష ఎలూరులోని జిల్లా కేంద్ర ఆసు పత్రిలో ఉన్న శిక్షణ కేంద్రాన్ని కొనసాగించడానికి కేటాయించ బడింది.

## ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు

ఈ పథకం క్రింద గ్రామీణ ప్రజలు అవసరాలను తీర్చడానికిగాను బ్లాకు ప్రాంతాలలో ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు స్థాపించ బడతాయి, ఈ సంవత్సరపు ప్రణాళికలో ఈ పథకం క్రింద రూ.15.00 లక్షల మొత్తం కేటాయించ బడింది. అందులో రూ.1.50 లక్షల మొత్తం, ఇంతకుముందు స్థాపించిన కేంద్రాలను కొనసాగించడానికి, 4 ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలను నెలకొల్పడానికి ఈజిల్లాకు కేటాయించ బడింది.

## ఇంటర్న్ శిక్షణ నిమిత్తం జిల్లా కేంద్ర ఆసుపత్రుల స్థాయిని పెంచడం

క్రొత్త నిబంధనల ప్రకారం ఎం. బి. బి. ఎస్ విద్యార్థులు, గుర్తించ

బడిన కొన్ని వైద్య విద్యా సంస్థలలో ఒకసంవత్సరం పాటు ఇంటర్న్లుగా శిక్షణ పొందాలి. ఈ ఇంటర్న్లకు అదనంగా వసతి కల్పించే ఉద్దేశంతో ఏలూరులో వసతి గృహాలు కట్ట బడతున్నాయి. అవి ఈ సంవత్సరంలో పూర్తి అవుతాయి. విశాఖ పట్నంలోని ఆంధ్రా మెడికల్ కాలేజీలోను, కాకినాడలోని జిల్లా కేంద్ర ఆసుపత్రిలోను ఇంటర్న్లకు అదనంగా వసతిగృహాలు కట్టడానికికూడా 1959-60లో తల పెట్ట బడింది. ఈ పథకానికి కేటాయించ బడిన రూ. 0.50 లక్ష మొత్తం లోను రూ. 0.10 లక్ష మొత్తం ఏలూరు జిల్లా ఆసుపత్రిలో ప్రారంభించిన భవనాల నిర్మాణాన్ని పూర్తి చేయడానికి వినియోగింప బడుతుంది.

## దంత వైద్య కళాశాల

## దంత చికిత్సా కేంద్రాల స్థాపన

ఈ సంవత్సరంలో ఈపథకంక్రింద రూ. 3.06 లక్షలమొత్తం కేటాయించ బడింది, అందులో రూ. 2.50 లక్షల మొత్తం ఆంధ్రప్రాంతానికి, రూ. 0.56 లక్ష తెలంగాణా ప్రణాళికక్రింద ప్రత్యేకించబడింది. ఈ మొత్తం, క్రొత్త కేంద్రాలను స్థాపించడంతోపాటు ఇదివరకు ప్రారంభించిన వాటినికొనసాగించడానికి, హైదరాబాదులోని ఉస్మానియా మెడికల్ కాలేజీలో 1958-59లో ప్రారంభించిన దంత చికిత్సా విభాగాన్ని కొనసాగించడానికి వినియోగించ బడుతుంది. ఈ మొత్తంలో రూ 0.20 లక్ష మొత్తం ఏలూరులోని జిల్లాఆసుపత్రిలో దంతచికిత్సా కేంద్రాన్ని ప్రారంభించేటందుకు కేటాయించ బడింది.

## కుష్టురోగ నివారణ

1957-58లోను 1958-59లోను ప్రారంభించిన 4 కుష్టు వ్యాధి నివారణ కేంద్రాలను కొన సాగించటమే కాకుండా క్రొత్తగా మరో రెండు కేంద్రాలను ప్రారంభించడానికిగాను ఈ సంవత్సరపు ప్రణాళికలో రూ. 2.55 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఇందులో కొంత మొత్తం 1958-59లో తణుకులో ప్రారంభించిన కేంద్రాన్ని కొనసాగించడానికి కేటాయించ బడింది.

## క్షయవ్యాధికి ప్రత్యేక పడకల ఏర్పాటు

ఇంతకు ముందు ఏర్పరచిన ప్రత్యేక పడకలను నిర్వహించడమే కాకుండా

ఆంధ్రప్రాంతంలో 290 ప్రత్యేక పడకలను నెలకొల్పడానికి ఈ సంవత్సరం తలపెట్ట బడింది. అందుకు రూ 5.00 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఇందులో రూ 0.90 లక్ష మొత్తం, ఏలూరులోని జిల్లాఆసుపత్రిలో 70పడకలు ఏర్పాటు చేయడానికిగాను ఈ జిల్లాకు ప్రత్యేకించ బడింది.

## సుఖవ్యాధి చికిత్సా కేంద్రాలు

ఇంతకు ముందు స్థాపించిన 5సుఖవ్యాధి చికిత్సా కేంద్రాలను కొన సాగించ డానికి, ఈ సంవత్సరం మరో 8 కేంద్రాలను నెలకొల్పడానికిగాను ఈ సంవత్సరపు ప్రణాళికలో రూ. 1.70 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఇందులో రూ. 0.20 లక్ష మొత్తం, ఏలూరులోని జిల్లా కేంద్ర ఆసుపత్రిలోసుఖ వ్యాధిచికిత్సా కేంద్రాన్ని ప్రారంభించ డానికి ఈ జిల్లాకు కేటాయించ బడింది.

## చెవి, ముక్కు, గొంతు చికిత్సా కేంద్రాలు

ఈ సంవత్సరం ఈ పథకానికి కేటాయించ బడిన రూ. 0.30 లక్ష మొత్తం లోను రూ. 0.06 లక్ష మొత్తం, 1958–59లో ఏలూరులోని జిల్లా కేంద్ర ఆసుపత్రిలో నెలకొల్పిన చెవి, ముక్కు, గొంతు వ్యాధుల చికిత్సా కేంద్రాన్ని కొనసాగించడానికి కేటాయించ బడింది.

## కంటివ్యాధి చికిత్సా కేంద్రాలు

1958–59లో 2 కంటివ్యాధి చికిత్సాకేంద్రాలు ప్రారంభించ బడినాయి. ఈ సంవత్సరంలో ప్రస్తుతం ఉన్న కేంద్రాలను నిర్వహించడమే కాకుండా మరి మూడు కేంద్రాలను ప్రారంభించడానికి తలపెట్టబడింది. అందులో రూ.0.06 లక్ష మొత్తం 1958–59లో ఏలూరులో స్థాపించబడిన కంటి వ్యాధి చికిత్సా కేంద్రాన్ని కొన సాగించడానికి వినియోగించ బడుతుంది.

# పరిశారోగ్యం

## దాయిలకు శిక్షణ

నాటు మంత్రసానులు పురుళ్ళు పోయడంలో ఉత్తమపద్ధతుల నవలంబించి తమవృత్తిని నిర్వహించ డానికిగాను శిక్షణ పథకం ఒకటి 1956-57లో ప్రారంభించ బడింది. రెండవ ప్రణాళిక మొదటి మూడు సంవత్సరాలలో 1329మంది ఈ పథకం క్రింద శిక్షణ కోసం చేర్చుకోబడ్డారు. ఈ సంవత్సరంలో ఆపథకం కొనసాగింపబడడమే కాకుండా మరొక 720 మంది అభ్యర్థులు చేర్చుకో బడతారు. అందుకోసం రు. 0.81 లక్ష మొత్తం రాజ్య పరిణాళికలో కేటాయిం చబడింది. 60మంది దాయీలకు శిక్షణ నిచ్చేటందుకు ఆ మొత్తంలో 5900 రూపాయలు ఈ జిల్లాలో వినియోగించ బడితాయి.

## మలేరియా బ్యూరో విస్తరణ

మొదటిప్రణాళిక కాలంలో స్థాపించబడిన 2 మలేరియా నివారణ యూనిట్లు 1956-57 లో కొనసాగింప బడినాయి. 1957-58 లో మరో 2 యూనిట్లు ఏర్పాటు చేయడం జరిగింది. ఈ యూనిట్లు 1958-59లో కొనసాగింప బడ్డాయి. ఈ వ్యాధిరాకుండా 40 లక్షల మందికి రక్షణ చేకూర్చ టానికి ఈ యూనిట్లు ఉపకరించాయి, నేషనల్ మలేరియా నివారణ కార్య క్రమం 1-4 1958నుండి మలేరియానిర్మూలనా కార్యక్రమంగా మార్చబడింది ఆదనంగా స్ప్రేయింగు పరికరాలు, డి.డి.టి.ని సరఫరా చేయడం ద్వారా మలే రియా సోకని ప్రాంతాలతో సహా రాజ్యం అంతటా మందు చల్లడం తీవ్రం చేయ బడుతుంది. 17సబ్ యూనిట్లతో ప్రస్తుతం ఉన్న 4యూనిట్లను కొనసాగించ డానికి, 16హైపో ఎండమిక్ యూనిట్లను తెరవడానికి, పరిశారోగ్యశాఖ రీజినల్ అసిస్టెంటుడైరెక్టర్ల కార్యాలయాలు మూడింటినినెలకొల్పడానికి 1959-60ప్రణా ళికలో రాజ్యప్రభుత్వం వాటాక్రింద రూ. 22.99 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఇందులో రూ. 1.35 లక్షల మొత్తం ఈ జిల్లాకు కేటాయించ బడింది.

హైపో ఎండమిక్ యూనిట్టును నెలకొల్పడానికి, ప్రస్తుతం ఉన్న ఒక సబ్ యూనిట్టును కొనసాగించ డానికి ఈ మొత్తం వినియోగించ బడుతుంది.

## ఆరోగ్య ప్రచారం

ప్రజలకు ఆరోగ్య విషయాలను తెలియ చెప్పేటందుకు 1957-58లో పజారోగ్యశాఖ డైరెక్టరు కార్యాలయంలో ఒక కేంద్ర ఆరోగ్య ప్రచార సంస్థ స్థాపించ బడింది. రెండు వ్యాన్లు కొనబడ్డాయి. ఇంతకుముందుకొన్న 11 జీపులను అంటువ్యాధులనివారణ గురించిప్రచారం చేయడానికి ఉపకరించే రెండు వ్యానుల ను నిర్వహించడం జరిగింది. 1958-59లో ఈ పథకాన్ని కొనసాగించ డానికి న్యూఢిల్లీలోని వర్కింగు గ్రూపు సమ్మతించలేదు. అయినప్పటికి 1959-60లో జిల్లాలలో ప్రస్తుతం ఉన్న 11జీపులనూ, 4 వ్యానులను నిర్వహించడానికి హైదరాబాదులోని కేంద్ర ఆరోగ్య ప్రచార సంస్థను కొనసాగించ డానికి, ఇంకా 8 క్రొత్తవ్యానులను కొనడానికి మూడు ప్రచార సంస్థలను నెలకొల్ప డానికి రూ. 4.15 లక్షల మొత్తం కేటాయించ బడింది. రూ. 4.15 లక్షల కేటాయింపులో రూ. 0.12 లక్ష మొత్తం, ఒక జీపును, ఒక వ్యానును నిర్వహించడానికిగాను, ఈ జిల్లాకు కేటాయించ బడింది.

---

# గ్రామీణ, పట్టణ నీటి సరఫరా

## పట్టణనీటి సరఫరా, మురుగు పారుదల పథకం

స్థానిక సంస్థలకు సంబంధించిన పట్టణ నీటిసరఫరా, మురుగు కాలువల పథకాల కయ్యే ఖర్చు క్రింద ఈ సంవత్సరం ఋణసహాయంగా భారతప్రభుత్వం వారినుండి రూ 102.446 లక్షల మొత్తం అందగలదని ఆశింపబడుతున్నది. ఇందులో *82.446 లక్షలు కేంద్రప్రణాళిక క్రింద రూ. 20.00లక్షలు రాజ్యప్రణాళిక కింద ఇవ్వబడుతుంది. ఇందులో రూ 41.270 లక్షలు మొత్తం

---

* ఇందులో రు. 5.446 లక్షల మొత్తం 1957-58లో ఈ పథకానికి చేసిన కేటాయింపులో ఖర్చుపెట్టబడ కుండ మిగిలినట్టిది.

కార్పొరేషను పథకాలకు కేటాయించ బడింది. మిగిలిన కేటాయింపులో రూ 4.500 లక్షల మొత్తం ఏలూరు మురుగు కాలువ పథకానికి వినియోగింప బడుతుంది.

---

# గృహ వసతి

## మురికి పేటల నిర్మూలన. పాకీవారికి గృహవసతి

అనారోగ్యకరమైన మురికి పేటలు ఏర్పడకుండా అరికట్టేటందుకు భారత ప్రభుత్వం వారు, మురికి పేటలలో నివసించే వారి కోసం మురికి పేటల నిర్మూలన పథకాన్ని రూపొందిచారు. ఏలూరు పట్టణంలో ఈ పథకాన్ని కొనసాగించ డానికి ఈ జిల్లాకు రూ. 0.46 లక్ష మొత్తం కేటాయించ బడింది. మొత్తం అంచనా ఖర్చులో భారత ప్రభుత్వం వారు నూటికి 75 వంతులు అడ్వాన్సు ఇస్తారు. అందులో నూటికి 50 వంతులు ఋణం క్రింద, 25 వంతులు సబ్సిడీ క్రింద ఇస్తారు. రాజ్య ప్రభుత్వం మాచింగు గ్రాంటు క్రింద నూటికి 25 వంతులు భరిస్తుంది.

## ప్రభుత్వ సహాయంతో పారిశ్రామిక గృహవసతి

భారత ప్రభుత్వం వారు ఋణాలు, సబ్సిడీల రూపంలో ఇచ్చే ఆర్థిక సహాయంతో పారిశ్రామిక కార్మికుల ఇండ్ల నిర్మాణానికి ఈ పథకం ఉద్దేశింప బడింది. ఈ పథకం క్రింద రెండు రకాల ఇండ్లు నిర్మింప బడుతున్నాయి. ఒకగది ఇల్లు రూ. 3,300 లు, రెండుగదుల ఇండ్లు రూ. 3,850 లు వ్యయంతో నిర్మింప బడుతున్నాయి. ఇందులో భూమి ఖరీదు, అభివృద్ధి ఖర్చులు చేరి వుంటాయి. నీటి సరఫరా, పారిశుధ్యం, విద్యుచ్ఛక్తి ఫిట్టింగులు వంటి వాటికయ్యే ఖర్చులు ఇందులో చేరవు. ఈ పథకం క్రింద జరిగే పనిని కొనసాగించడానికి 1959–60 ప్రణాళికలో రూ. 21.88 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఈ మొత్తం నంద్యాలలో 50 ఇండ్లను, బుగ్గన్నపల్లిలో 110 ఇండ్లను, విశాఖపట్నంలో

150 ఇండ్లను, గుంటూరులో 150 ఇండ్లను, గుంతకల్లులో 100 ఇండ్లను రాజమండ్రిలో 100 ఇండ్లను ఏలూరులో 100 ఇండ్లను నిర్మించే పనిని ప్రారంభించడానికి వినియోగింప బడుతుంది,

### పట్టణాలలో గృహ వసతి

### సహకార సంఘాలు.

పట్టణ గృహ నిర్మాణ సహకార సంఘాల సభ్యులకు ఇండ్లు నిర్మించు కోవడానికి దీర్ఘకాలిక ఋణాలివ్వడం ద్వారా పట్టణప్రాంతాలలోని ఇండ్ల కొరతను తీర్చడానికి ఈపథకం ఉద్దేశింప బడింది, ఈసంవత్సరంలో ఆంధ్రప్రాంతంలో క్రొత్తగా 340 ఇండ్లను నిర్మించు కోవడానికి ఋణాల క్రింద ఇచ్చేటందుకు రూ 20.00 లక్షల మొత్తం కేటాయించ బడింది. పై కేటాయింపులో రు. 0.80 లక్ష మొత్తం 14 ఇండ్లను నిర్మించ డానికి ఈ జిల్లాకు కేటాయించ బడింది.

---

## కార్మికులు-కార్మికసంక్షేమం

### ఉద్యోగ సమాచార సేకరణ

ఈ పథకం ఈ క్రింది వాటికోసం ఉద్దేశింప బడింది.

1. ఏ రకం ఉద్యోగులు కొరతగా ఉన్నారో ఎంప్లాయిమెంటు అధికారులు కచ్చితంగా నిర్ణయించడం కోసం ఇంకా ఎక్కువ వివరాలను వారికి అంద చేయడం.

2, విద్యాభ్యాసం పూర్తిచేసిన వారికి ఉద్యోగాన్వేషణలో ఉన్నవారికి ఉద్యోగాల విషయంలోను, ఉద్యోగ అవకాశాల విషయంలోను సలహానిచ్చేటందుకు సమాచారాన్ని అందచేయడం.

3. ఉద్యోగ సాధక కేంద్ర ప్రాంతంలోగాని, నిర్ణీత ఎంప్లాయిమెంటు మార్కెట్లుగా పరిగణింపబడే ఇతర ప్రాంతాలలో గాని ఉద్యోగ నియమావకాశాలలో వచ్చేమార్పులు గమనించడానికి పద్ధతులను రూపొందించడం.

4. ప్రతి పరిశ్రమ, వృత్తులలో ఉండే ఉద్యోగ, నిరుద్యోగాల పోకడలను ముందుగా సూచించడం.

ఈపథకం, 1957–58లో ఐదు పెద్దఉద్యోగ సాధక కేంద్రాలలో అమలు పరచ బడింది. ఆ కేంద్రాలేవంటే హైదరాబాదు, వరంగల్లు, విశాఖపట్టణం, విజయవాడ, కర్నూలు. వీటి కేంద్రయూనిటు హైదరాబాదులో ఉన్న నేషనల్ ఎంప్లాయిమెంటు సర్వీసు డైరెక్టరేటులో ఏర్పాటు చేయబడింది. 1958–59లో ఈ పథకం కాకినాడ, గుంటూరు, నిజామాబాదులలోని జిల్లా ఉద్యోగ సాధక కేంద్రాలకు విస్తరింప చేయబడింది. 1959–60లో విశాఖపట్నం, విజయవాడ, కాకినాడ, గుంటూరు, వరంగల్లులలోని ప్రైవేటు రంగాన్ని పరిశీలించడానికి తలపెట్టబడింది. ఇందుకోసం పైన తెలుప బడిన ఎక్స్ఛేంజీలలో అదనపు సిబ్బందిని నియమించడం. డైరెక్టరేటులోని సెంట్రల్ యూనిట్టును ఒక సీనియరు అధికారి అజ్మాయిషీక్రింద వుంచడంద్వారా సెంట్రల్ యూనిట్టును పటిష్టం చేయటం జరుగుతుంది. మిగిలిన అన్ని కేంద్రాలలో కూడ సిబ్బందిని పెంచడానికి ఉద్దేశింప బడింది. ఈ కేంద్రాలన్నిటిలోను ఒకొక్క గుమాస్తాను అదనంగా నియమిస్తారు. ఈ పథకానికి అయ్యేఖర్చులో కేంద్ర ప్రభుత్వం వారు భరించే రు. 0.31 లక్షకు తోడుగా రాజ్య ప్రభుత్వ వాటా క్రింద 1959–60 ప్రణాళికలో రు. 0.47 లక్ష మొత్తం కేటాయించ బడింది. మొత్తం రు. 0.78 లక్షలోను రు. 0.013 లక్ష మొత్తం ఈ జిల్లాలోని కార్యక్రమం క్రింద వినియోగించ బడుతుంది.

### ఉద్యోగుల భీమా పథకం

కార్మికులకు మాత్రమే వైద్య సదుపాయాలను కలగ చేసే ఉద్దేశంతో 1955 లో ఆంధ్ర, తెలంగాణ ప్రాంతాలలో ఈ పథకం అమలు జరుప బడింది.

1957–58 లో భారత ప్రభుత్వం వారి కోరిక మీద, భీమా చేసిన కార్మికుల కుటుంబాలకు కూడా ఈ పథకం వల్ల కలిగే ప్రయోజనాలను కలుగ చేయుడానికి ఉద్దేశింప బడింది. కాని యీ పథకాన్ని ఆ సంవత్సరం అమలు పరచడానికి వీలులేక పోయింది, ఈ పథకం క్రింద వైద్య సౌకర్యాలు 21–1–1959 అగాయతు రాజ్యంలోని భీమా చేసిన కార్మికుల కుటుంబాలకు కూడ విస్తరింప చేయబడ్డాయి. పార్ట్ టైం వైద్యశాలలు చాలవరకు పూర్తికాలం పనిచేసేవైద్యశాలలుగామార్చ బడ్డాయి. ఈపథకంకోసం కేటాయించ బడిన రూ. 1.80 లక్షల లోను రూ. 0.10 లక్ష మొత్తం.పూర్తికాలం వైద్యశాలల ఏర్పాటుకు లేక ప్రస్తుతం పార్టుటైం వైద్యశాలలుగా ఉంటున్న వాటిని పూర్తికాలం వైద్యశాలలుగా మార్చడానికి ఈ జిల్లాకు కేటాయించ బడింది. ఇందువల్ల భీమాచేసిన కార్మికులకు కుటుంబాలకు వైద్యసౌకర్యాల్ని విస్తరింప జేయడానికి వీలు కలుగుతుంది.

---

# వెనుక బడిన తరగతులు, షెడ్యూల్డుకులాల సంక్షేమం

## షెడ్యూల్డు కులాలు,

### షెడ్యూలు కులాలకు స్కాలరు షిప్పులు

ఈ పథకం క్రింద హరిజన విద్యార్థులకు ఇతరఅర్హమైన కులాల విద్యార్థులకు అన్ని తరగతులలోను స్కాలరు షిప్పులు మంజూరు చేయబడుతున్నాయి. తల్లి దండ్రుల ఆదాయం, ఉన్నతపాఠశాల విద్యార్థుల విషయంలో రూ.1500,లకు కళాశాల విద్యార్థుల విషయంలో రూ. 1,800 మించకుండా ఉంటే రుసుం చెల్లించనవసరం లేకుండా మాఫీ చేయబడుతుంది. 1959–60లో ఇది వరకు మంజూరు చేసిన స్కాలరు షిప్పులను కొనసాగించటమే గాక అదనంగా 1,600 స్కాలరు షిప్పులు మంజూరు చేయటం కోసం రు.4. 90లక్షల మొత్తం ప్రణాళికలో కేటాయించ బడింది. స్కాలరు షిప్పులు, ఈ జిల్లాలోని అర్హులైన విద్యార్థులకు కూడా ఇవ్వబడతాయి,

## మెడ్యూలు కులాల వారికి హాస్టళ్లు

ఆంధ్ర ప్రాంతంలో ప్రభుత్వ సహాయంతో నడపబడే హాస్టళ్లు 438 ఉన్నాయి. విద్యా సంవత్సరానికి విద్యార్థికి రూ. 150/- చొప్పున బోర్డింగు గ్రాంట్లు వెనుకబడిన తరగతుల, హరిజనుల విద్యార్థులకు ఇవ్వబడుతున్నాయి. ఈసంవత్సరపు ప్రణాళికలో 670 అదనపు బోర్డింగు గ్రాంట్లు మంజూరు చేయడానికి రూ. 1.00 లక్ష మొత్తం కేటాయించ బడింది. బోర్డింగు గ్రాంట్లు ఈ జిల్లాలోని హాస్టళ్ళకు కూడా ఇవ్వబడతాయి.

## మెడ్యూల్డు కులాలవారికి ప్రభుత్వ హాస్టళ్లు,

ఈ జిల్లాలోని గణపవరం,కొయ్యలగూడెంల లో ఉన్న హాస్టళ్ళు 1959-60లో రూ.0.168 లక్ష వ్యయంతో నిర్వహించ బడతాయి.

## పాఠశాలలు, హాస్టళ్ళ భవనాల నిర్మాణం, మరమ్మత్తులు

ఆంధ్ర ప్రాంతంలోని సాంఘికసంక్షేమ పాఠశాలలు, సాంఘికసంక్షేమ శాఖ ఆజ్మాయిషీ క్రిందగల సబ్సిడి పొందే హాస్టళ్ళు అద్దెభవనాలలో నెలకొల్ప బడ్డాయి. అందువల్ల హరిజనుల సౌకర్యార్థం నడపబడే సాంఘిక సంక్షేమ పాఠశాలలకు సబ్సిడి పొందే హస్టళకు పక్కా భవనాలను నిర్మించడానికి తలపెట్టబడింది. 1959-60లో 25 పాఠశాల భవనాల నిర్మాణం కోసం రూ. 1.00 లక్ష మొత్తం కేటాయించ బడింది. అందులో 3 భవనాలు రూ.0.10 లక్ష వ్యయం తో ఈ జిల్లాలో నిర్మించ బడతాయి.

## పారిశుధ్య సౌకర్యాలు,

సాధారణంగా అనారోగ్యకరమైన వాతావరణంలో ఉండే హరిజన వాడలను ఆరోగ్య కరంగా చేయడానికి కాలిబాట, పాయిఖానాలు, స్నానాలగదులు మంచినీటి బావులు, మొదలైన పారిశుధ్య సౌకర్యాలను ఏర్పాటు చేయడం అవసరం. 1959-60లో ఆంధ్ర ప్రాంతంలో 217 మంచినీటి బావులు త్రవ్వడానికి ప్రణాళికలో రూ.4.34 లక్షల మొత్తం కేటాయించ బడింది. అందులో 20 బావులు. రూ. 0.40 లక్ష వ్యయంతో ఈ జిల్లాలో త్రవ్వ బడతాయి.

## నివేశన లాల సేకరణ

నివేశన స్థలాల సేకరణకు, ఉచితంగా వాటిని హరిజనులకు ఇవ్వడానికి 1959–60లో ఈ పథకం క్రింద రూ. 8,00 లక్షలు కేటాయించ బడ్డాయి. అందులో రూ. 0.75 లక్ష మొత్తం ఈ జిల్లాకు కేటాయించ బడింది.

## ప్రచారం

అస్పృశ్యతను నిర్మూలించడానికి 1959–60 ప్రణాళికలో రూ. 0 45 లక్ష మొత్తం ప్రత్యేకించ బడింది. ఈ మొత్తం, అస్పృశ్యత వల్ల కలిగే నష్టాన్ని గురించి ప్రచారం చేయడానికి, నాటకాలు, యక్షగానాలలో ఉత్తమమైన వాటికి బహుమతులివ్వడానికి, పత్రికలకు సబ్సిడీలను ఇవ్వడానికి, పోస్టర్లను, కరపత్రాలను అచ్చువేయడానికి, హరిజన దినోత్సవాలు జరుపడానికి, వర్ణాంతర భోజనాలను ఏర్పాటు చేయడానికి వినియోగింప బడుతుంది. ఈ జిల్లాలో ఈ పథకాన్ని అమలు పరచడం కోసం రూ. 0.035 లక్ష మొత్తం కేటాయించ బడింది.

## స్వచ్ఛంద సంస్థలకు సహాయం

హరిజన సేవక సంఘం, భారత సేవక్ సమాజ్, గిల్డుఆఫ్ సర్వీసు, రెడ్‌క్రాస్ సొసైటి, క్లబ్బులు తదితర స్వచ్ఛంద సంస్థలు, అనేకం హరిజనోద్ధరణకు కృషి చేస్తున్నాయి. ఈ సంస్థలకు ఈ విషయంలో తగు ప్రోత్సాహం ఇచ్చేటందుకు ఆర్థిక సహాయం చేయబడుతుంది. ఇందుకు రూ. 0.60 లక్ష మొత్తం 1959–60 ప్రణాళికలో కేటాయించ బడింది. ఈ జిల్లాలోని స్వచ్ఛంద సంస్థలు కూడా ఈ సహాయాన్ని పొందటానికి అర్హమై ఉంటాయి.

## గృహావసతి

నివేశన స్థలాన్ని ఇచ్చినా కూడా, స్వంతంగా ఇల్లు కట్టుకోలేనంత బీద స్థితిలో ఉన్నారు హరిజనులు. అందువల్ల ఇల్లు కట్టుకోవడానికి సబ్సిడీలను ఋణాలను కూడా మంజూరు చేయడానికి తలపెట్ట బడింది. లేబరు సామగ్రి

మొదలైనవాటి క్రింద ఇవ్వబడే సహాయం కాకుండా ఇంటికి రూ. 750లు ఇవ్వబడతాయి, అంటే రూ. 250 సబ్సిడీ క్రింద రు. 500 ఋణం క్రింద ఇవ్వబడుతాయి. ఈ ఋణం మొత్తం ఈ సహాయం పొందేవారినుండి వసూలు చేయబడుతుంది. ఇతరులకు చెందినవారు కూడా హరిజనులతో కలిసిమెలిసి ఉండే టట్లు ప్రోత్సహించటానికిగాను, నిర్మించేటందుకు తలపెట్టబడినఇళ్ళలో 10 శాతము వెనుక బడిన తరగతుల వారికి ప్రత్యేకించ బడుతున్నాయి. 1959–60 లో ఈ జిల్లాలో 63 ఇళ్ళను నిర్మించే టందుకు ప్రణాళికలో రూ. 0.47 లక్ష మొత్తం కేటాయించ బడింది.

## వెనుక బడిన తరగతులు

### వెనుక బడిన తరగతుల విద్యార్థులకు స్కాలరు షిప్పులు

వెనుకబడిన తరగతుల విద్యార్థులకు స్కాలరుషిప్పులు ఇవ్వడానికి, రాజ్య ప్రభుత్వం వారు ఏటా సుమారు రూ. 4.00 లక్షల మొత్తం ఖర్చుపెడుతున్నారు. ఆంధ్రప్రాంతంలోని అనేక పాఠశాలలోను కళాశాలలల్లోను చదువుతున్న వెనుక బడిన తరగతుల విద్యార్థులకు అదనంగా 920 స్కాలరు షిప్పులు మంజూరు చేయ డానికి ఈ సంవత్సరంలో రూ. 2.74 లక్షల మొత్తం కేటాయించ బడింది, స్కాలరుషిప్పులు ఈ జిల్లా లోని వెనుక బడిన తరగతుల విద్యార్థులకు కూడా లభ్యమౌతాయి.

### వెనుకబడిన తరగతుల విద్యార్థులకు బోర్డింగు గ్రాంటులు

ఉన్నత పాఠశాలల్లోను కళాశాలల్లోను చదువుకుంటున్న వెనుక బడిన తరగతుల విద్యార్థులకు సబ్సిడీ పొందుతున్న హాస్టళ్ళలో బోర్డింగు గ్రాంట్లు ఇవ్వ బడుతున్నాయి, ఈ గ్రాంట్లు ఒక్కొక్క బోర్డరుకురూ. 150 చొప్పున ప్రతివిద్యా సంవత్సరం ఇవ్వబడుతున్నాయి, 1959–60లో అదనంగా 445 బోర్డింగు గ్రాంట్లను ఇచ్చేటందుకు గాను ప్రణాళికలో రూ. 0.67 లక్ష మొత్తం కేటా యించ బడింది. బోర్డింగు గ్రాంట్లు ఈ జిల్లాలోని వెనుక బడిన తరగతుల విద్యా ర్థులకు కూడా లభ్యమౌతాయి.

## వెనుక బడిన తరగతుల వారి పిల్లలకు మధ్యాహ్నపు భోజనాలు

సాంఘిక సంక్షేమ పాఠశాలల్లో వెనుకబడిన తరగతుల పిల్లలు చేరడాన్ని ప్రోత్సహించేటందుకు రెండవ ప్రణాళిక ప్రారంభంనుండి సాంఘిక సంక్షేమ పాఠశాలల్లో చదివే పిల్లలకు మధ్యాహ్నపు భోజనాలు ఏర్పాటు చేయబడు తున్నాయి. ఈ విధంగా చేయడం వల్ల అస్పృశ్యతా నిర్మూలనానికి కూడా తోడ్పడం జరుగుతుంది. 1959–60లో ఈ పథకం కోసం రూ. 0.50 లక్ష మొత్తం ఖర్చు పెట్టడానికి ప్రతిపాదింప బడింది. ఈ జిల్లాలోని వెనుక బడిన తర గతుల పిల్లలకుకూడ దీనివల్ల లాభం చేకూరుతుంది.

## విముక్త జాతులు

విముక్త జాతుల వారి పిల్లలు పాఠశాలలకు పోయి చదువు కోరు. కారణం, వాళ్ల తల్లిదండ్రులు వాళ్లను పాఠశాలకు పంపి చదివించ లేకపోవడమే. అందువల్ల పిల్లలకు, పుస్తకాలు పలకలు మొదలైనవి ఇవ్వడానికి సిలపెట్ట బడింది. 1959–60 ప్రణాళికలో రూ. 0.09 లక్ష మొత్తం కేటాయించ బడింది. ఈ సంవ త్సరంలో చిత్తూరు జిల్లాలోని విముక్త జాతుల వారికాలనీలలోని 2 పాఠశాలలను, 2 రేడియో సెట్లను నిర్వహించడమే కాకుండా, పుస్తకాలు, పలకలు మొదలైనవి ఇవ్వడం, స్కాలరు షిప్పులను మంజూరు చేయడం జరుగుతుంది. ఈజిల్లాలోని విముక్త జాతుల పిల్లలకు కూడా ఈ పథకం వల్ల లాభం చేకూరుతుంది.

## గృహ వసతి.

ఈ పథకం క్రింద, విముక్త జాతులవారు వారిసొంత గుడిసెలను వేసుకోవ డానికిగాను సుమారు రు 100ల వరకు ఖరీదుచేసే భవనాల సామాగ్రిని సరఫరా చేయడానికి, ప్రస్తుతం వున్నవారి ఇళ్ళను మరమ్మత్తు చేసుకోవలసి వున్నట్లయితే కుటుంబానికి రూ.30లు నగదు ఇవ్వడానికి ఉద్దేశింప బడింది. 40 క్రొత్త ఇండ్ల నిర్మాణానికి, 40 పాతఇండ్ల మరమ్మత్తుకు ఈ సంవత్సరం రూ. 0.052 లక్ష మొత్తం ఈ జిల్లాకు ప్రత్యేకించ బడింది.

## వ్యవసాయ సహాయం.

ఈ పథకం క్రింద, విముక్త జాతుల వారికి ఆర్థికంగా పునరావాసాన్ని కల్పించి వ్యవసాయం చేసుకునేటట్లు చేయడానికి దుక్కిటెద్దులు సరఫరా చేయడానికి, పంపుసెట్లు స్థాపించడానికి పాత బావుల మరమ్మత్తులు మొదలైనవి చేయడానికి తలపెట్టబడింది. 1959–60 లో ఈజిల్లాలో ఒక జత ఎద్దుల్ని సరఫరా చేయడానికి రూ. 300 లు ప్రత్యేకించ బడినాయి.

## కుటీర పరిశ్రమలు.

ఈ పథకం క్రింద విముక్త జాతులవారు, వృత్తులను కొనసాగించు కొనేటందుకు పనిముట్లు పరికరాలు, ముడి పదార్థాలు, సరఫరా చేయబడతాయి, ప్రతివ్యక్తికి పనిముట్లు, పరికరాలు, ముడిపదార్థాల రూపంలో రు.50/– అవరకు సహాయం ఈయబడుతుంది. దీనికోసం ఈ సంవత్సరపు ప్రణాళికలో రూ. 0.15 లక్ష మొత్తం ప్రత్యేకించ బడింది. అందులో ఈ జిల్లాకు రూ. 750 లు కేటాయించ బడినాయి. ఈ పథకం క్రింద 15 మందికి లాభం చేకూరుతుంది.

## వైద్య సహాయం.

వైద్య సహాయం కోసం, తదితర ఖర్చుల కోసం విముక్త జాతులకు చెందిన అర్హులైన 50 మంది రోగులకు రూ. 40/– చొప్పున డిస్క్రిషనరీ గ్రాంటు లను ఈ పథకం క్రింద ఇవ్వడానికి తలపెట్ట బడింది. దీనికోసం 1959–60 ప్రణాళికలో రూ. 0.02 లక్ష మొత్తం కేటాయించ బడింది. అందులో రూ. 80/– లు. ఇద్దరు విముక్త జాతులవారికి డిస్క్రెషనరీ గ్రాంటులను ఇవ్వడానికి ఈ జిల్లాకు ప్రత్యేకించ బడినాయి.

# షెడ్యూల్డు తెగల సంక్షేమం

## పాఠశాలల్లో చదివే పిల్లలకు పలకలు, పుస్తకాలు సరఫరా

షెడ్యూల్డు తెగలవారు తమపిల్లల్ని చదివించుకోవడానికి ఉత్సాహాన్ని కలిగించే ఉద్దేశంతో ప్రాథమిక పాఠశాలల్లో చదివే పిల్లలకు పుస్తకాలు, పలకలు, బట్టలు ఇవ్వడానికి ఓ పథకం ఏర్పాటు చేయబడింది. రూ. 0. 24 34 లక్ష వ్యయముతో 1959–60 లో ఈ పథకాన్ని కొనసాగించడానికి తలపెట్టబడింది. ఈ పథకం క్రింద 4057 మంది పిల్లలకు లాభం చేకూరుతుందని ఆశింపబడుతున్నది

## ఏజెన్సీ ప్రాంతాల్లోని పాఠశాలలు, హాస్టళ్లకు పక్కా భవనాల నిర్మాణం

ఏజెన్సీ ప్రాంతాల్లో పాఠశాలలకు శాశ్వత భవనాలు లేకపోవడంవల్ల ఈజిల్లాలోని ఏజెన్సీప్రాంతాల్లో 1959–60 లో 5 పక్కాభవనాలను నిర్మించడానికి తలపెట్ట బడింది ఇందుకోసం ఈసంవత్సరపు ప్రణాళికలో రూ 0. 45 లక్ష మొత్తం కేటాయించ బడింది.

# వ్యవసాయం

## పైలెట్ ప్రదర్శన క్షేత్రాలు

పైలెట్ ప్రదర్శనక్షేత్రం ఒకటి 1957–58లో ఈజిల్లాలోని బుట్టాయగూడెంలో ప్రారంభించ బడింది ఇది ఆధునిక వ్యవసాయ పద్ధతుల్ని గురించి షెడ్యూల్డు తెగలవారికి శిక్షణనిస్తుంది. ఈక్షేత్రం రూ 0.107 లక్ష వ్యయంతో 1959–60 లో కొనసాగింప బడుతుంది. మేలురకం విత్తనాలు, అరటి పండ్ల మొక్కలు మొదలైనవి, కొండ ప్రజలకు పంపిణీచేసే నిమిత్తం ఉత్పత్తి చేయబడతాయి.

## ఏజెన్సీ ప్రాంతాల్లో

## ప్రదర్శన యూనిట్లు

మెరుగ్యాల్లు నగలప్రజలకు ఆదునిక వ్యవసాయరీతులను గురించి తెలియ చేసేటందుకు ఆంధ్రప్రాంతంలోని ఏజెన్సీజిల్లాలలో 1958–59 నుండి పద్ప్రదర్శన యూనిట్లను ప్రారంభించడానికి తలపెట్టబడింది. ఆదేశ ప్రకారం 1958–59 లో విశాఖపట్నం జిల్లా చింతపల్లిలో ఒక ప్రదర్శన యూనిట్టు తెరవ బడింది. 1959–60 ప్రణాళికలో ఇంతకుముందు ప్రారంభించిన యూనిట్టును కొనసాగించడమే కాకుండా ఆంధ్రప్రాంతంలో 7 ప్రదర్శన యూనిట్లను ప్రారంభించడానికి గాను రూ 1.55 లక్ష మొత్తం కేటాయించబడింది. అందులో రూ 0.197 లక్ష బుట్టాయి గూడెంలో ప్రదర్శన యూనిట్టును ప్రారంభించడానికి ఈజిల్లాకు కేటాయించ బడింది

## పశువుల పంపకం

పచ్చిక సమృద్ధిగా దొరికే ఆంధ్రప్రాంతంలోని ఏజన్సీప్రాంతాల్లో మేలు రకం పశుగణాన్ని పంపకం చేయటానికి సంబంధించిన పథకం మొదటి ప్రణాళికా కాలంలో అమలులో ఉండినది. ఈప్రాంతాల్లోనిపశుగణాభి వృద్ధినినిలబెట్టడం కోసం ఒక బోతును ఒకఆవును ర గొర్రెలను, 50కోళ్ళను ఈ జిల్లాలో పంచి పెట్టడానికి తలపెట్ట బడింది. అందు కోసం 1959–60 ప్రణాళికలో రూ. 0.0894 లక్షమొత్తం కేటాయించబడింది.

## గ్రామీణరోడ్లు

## ఏజన్సీ గ్రామల్లో రోడ్లు

ఈ జిల్లాలో నిఏజన్సీ ప్రాంతాల్లో చిన్నగ్రామీ ణరోడ్లను వేయడానికి, చిన్న చిన్న మరమ్మత్తులను చేయడానికి 1959–60 ప్రణాళికలో రూ .0.05 లక్ష మొత్తం కేటాయించ బడింది.

## భూస్థిరీకరణ

పోడువ్యవసాయం మాన్పించి ఆదివాసులు శాశ్వత సాగుచేసుకొనేటట్లు చేసేఉద్దేశంతో గుడిసెలను నిర్మించి, భూములు బాగుచేయించి వాటిని ఈ దిగువ తెల్పిన కాలనీలలో ఆదివాసి కుటుంబాలకు కేటాయించడానికి ఉద్దేశింప బడింది, ప్రతికాలనీకి 1959–60లో కేటాయించ బడిన మొత్తం ఈ దిగువ తెలుప బడినది.

| వరుస సంఖ్య | కాలనీ పేరు | రూ. లక్షలలో కేటాయింపు |
|---|---|---|
| 1 | తూర్పు పశ్చిమ గోదావరి జిల్లాల భూస్థిరీకరణ పథకం | 0. 20 (తూర్పు పశ్చిమ గోదావరి జిల్లాలలో) |

## ఏజన్సీ ప్రాంతాల్లో మత్స్య పరిశ్రమాభి వృద్ధి

శాస్త్రీయపద్ధతులమీద మత్స్యపరిశ్రమను కొనసాగించడంలో ఆదివాసులకు ఉత్సాహాన్నిచ్చి వారికి శిక్షణ గరిపే నిమిత్తం, చిరుచే పల్లి పంపిణీ చేయడానికి మత్స్యపరిశ్రమను అభివృద్ధి పరచడానికి 1959–60లో రూ 0.016 లక్ష మొత్తం ఈ జిల్లాకు కేటాయించ బడింది.

## ఏజన్సీ ప్రాంతాల్లో రేడియో సెట్ల స్థాపన

ఏజన్సీ గ్రామాల్లో రేడియో సెట్ల స్థాపనకు, ఇదివరకు స్థాపించిన 12 రేడియో సెట్లను నిర్వహించ డానికిగాను ఈజిల్లాకు 1959–60లో రూ 0.01338 లక్ష మొత్తం కేటాయించ బడింది.

## సహకారం

### కోటరామచంద్రపురం సహకార క్రయ విక్రయ సంఘం అభివృద్ధి

పశ్చిమగోదావరిజిల్లా పోలవరం తాలుకాలోని ఏజన్సీ ప్రాంతాలలోని ఆదిమవాసుల ప్రయోజనార్థం 1955లో కోటరామచంద్రపురంలో ఒక సహకార క్రయవిక్రయ సంఘం నెలకొల్ప బడింది గిడ్డంగులు మొదలైన వాటిని నిర్మించేటందుకు 1959–60 ప్రణాళికలో రూ 0.15 లక్ష మొత్తం ప్రత్యేకించ బడింది. గృహకృత్యాలకు అవసరమయ్యే సమారు రూ 50,000 విలువ చేసే వస్తువులు ఆదిమవాసులనుండి కొనబడతాయి. రు. 11,250 వరకు ఋణాలను ఇవ్వడం కూడా జరుగుతుంది.

---

## స్త్రీ సంక్షేమం

### ఏజెన్సీలలో స్త్రీ సంక్షేమ విభాగాలు

ఆరోగ్యకరమైన జీవనాన్ని, పరిశుభ్రమైన అలవాట్లను ఆదిమవాసుల స్త్రీలు అలవరచుకొనేటట్లు చేయడానికి, గృహ నిర్వహణ విషయాలను, తీరిక సమయాలను సద్వినియోగం చేసుకోవడానికి సంబంధించిన విషయాలను బోధించడాని మొదటి ప్రణాళికా కాలంలో ఆరు స్త్రీ సంక్షేమ కేంద్రాలు నెలకొల్ప బడ్డాయి. రెండవ ప్రణాళికా కాలంలో మరి మూడు కేంద్రాలు 1956–59లలో ప్రారంభించ బడ్డాయి. ఈ సంవత్సరంలో మరి మూడు కేంద్రాలను ప్రారంభించడానికి ఉద్దేశింప బడింది. అందుకు ప్రణాళికలో రూ.0.56 లక్ష మొత్తం కేటాయింప బడింది. అందులో రూ. 0.166 లక్ష మొత్తం, ఒక క్రొత్తశాఖను ప్రారంభించడానికి, ఇది వరకే ప్రారంభించిన శాఖను కొనసాగించడానికి ఈ బ్లాక్కు కేటాయించ బడింది.

### ఫీల్డు సిబ్బందికి
### పునశ్చరణ తరగతులు

ఈ పథకం క్రింద స్త్రీసంక్షేమశాఖ ఫీల్డు సిబ్బంది కోసం సర్కిల్సు ప్రాంతాల్లో పునశ్చరణ తరగతులు నిర్వహింపబడతాయి. పిటిష్టు ప్రభుత్వం వారు చేపట్టిన వివిధ పథకాలు, అభివృద్ధి కార్యక్రమాలు విషయంలో విజ్ఞానాన్ని పెంపొందించుకోడానికి ఫీల్డు సిబ్బందికి వీలు కలుగుతుంది. ఈ సంవత్సరంలో 5గురు అభ్యర్థులకు శిక్షణ ఇచ్చేందుకు ఈజిల్లాకు రూ. 0.005లక్ష మొత్తం కేటాయించబడింది.

### రోగులకు, అవిటి వారికి సాంఘిక సహాయం

శారీరకంగా ఎటువంటి కష్టం చేయచేత కానటువంటి అదివరవారి స్త్రీ రోగులకు సహాయం చేయడానికి అవిటి వారికి పునరావాస సౌకర్యం కలగ చేయడానికి ఈ పథకం ఉద్దేశిస్తున్నది. ఈ సంవత్సరంలో ఇందుకోసం రూ. 0.025 లక్ష మొత్తం కేటాయించబడింది. ఈ పథకం క్రింద 12 మంది స్త్రీలకు లాభం చేకూరుతుంది.

## వైద్యం

### జిలుగుమిల్లి ప్రభుత్వ వైద్యశాలకు
### అభివృద్ధి పనులు

జిలుగుమిల్లి వైద్యశాలకు అభివృద్ధి పనులకు కొనసాగించడానికి, 1956–57లో ప్రారంభించిన సిబ్బంది గృహాలను నిర్మాణాన్ని కొనసాగించడానికి 1959–60 ప్రణాళికలో రూ. 0.046 లక్ష మొత్తం ప్రత్యేకించబడింది.

### పోలవరంలో సంచార వైద్య దళం

పోలవరంలో ఉన్న సంచార వైద్యదళం రూ. 0.08 లక్ష ఖర్చుతో ఈ సంవత్సరం కూడా కొనసాగింపబడుతుంది.

## పోలవరం ప్రభుత్వ ఆసుపత్రికి

## అభివృద్ధి పనులు

పశ్చిమ గోదావరి జిల్లాలోని ఏజెన్సీ ప్రాంతాలలో ముఖ్య కేంద్రం అయిన పోలవరంలోని తాలూకా హెడ్ క్వార్టర్సు ఆసుప్రతికి అభివృద్ధిపనులను జరిపించ డానికి 1959–60 ప్రణాళికలో రూ. 0.05 లక్ష మొత్తం కేటాయించ బడింది.

## ప్రజారోగ్యం

## ఏజెన్సీ ప్రాంతాల్లో

## మలేరియా నివారణ కార్యక్రమం

ఆంధ్రప్రాంతంలో ఏజెన్సీ భూములలో మలేరియా ముఖ్యమైన వ్యాధి. మొదటి పంచవర్షప్రణాళికా కాలంలో మలేరియా నివారణ కార్య క్రమాలు ప్రారంభించ బడ్డాయి. రెండవ ప్రణాళికాకాలంలో కూడా అవికొనసాగించ బడుతున్నాయి. ఈ సంవత్సరంలో రూ. 5.00 లక్షల మొత్తం ఈకార్యక్రమాన్ని ఆంధ్రప్రాంతం లోని ఏజెన్సీలో ఇతర భాగాలకు కూడా విస్తరింప చేయడానికి కేటాయించ బడింది. అందులో రూ. 0.62 లక్ష మొత్తం ఈ జిల్లాకు ప్రత్యేకించ బడింది.

## ఏజెన్సీ ప్రాంతాల్లో

## మాతా, శిశు ఆరోగ్య కేంద్రాలు

శిశు మరణాలను అరికట్టేటందుకు 1957–58లో 3 మాతా శిశు ఆరోగ్య కేంద్రాలు ప్రారంభించ బడ్డాయి. ఈ సంవత్సరంలో మరొక కేంద్రాన్ని ప్రారంభించడానికి తలపెట్ట బడింది. పాత కేంద్రాన్ని కొనసాగించ డానికి క్రొత్త కేంద్రాలను ప్రారంభించడానికి 1959–60 ప్రణాళికలో రూ. 0.73 లక్ష మొత్తం కేటాయించ బడింది. అందులో రూ. 0.04 లక్ష మొత్తం ఈ జిల్లాకు ప్రత్యేకించ బడింది.

## ఏజెన్సీ ప్రాంతాలలో

### మంచి నీటిబావులు

ఏజన్సీ ప్రాంతాలలో మంచినీటి సౌకర్యాలు కొరతగా ఉన్నందున ఆదివాసులు వాగుల నీటిని, నిలవ ఉన్న నీటిని త్రాగుతు ఉంటారు. ఇది ఆరోగ్యానికి భంగకరం. వీరికి మంచినీటిని సరఫరా చేసేనిమిత్తం రూ 0.19 లక్షమొత్తం ఖర్చుతో ఈ జిల్లాలోని ఏజన్సీ ప్రాంతాలలో 6 బావులను త్రవ్వడానికి ఉద్దేశింప బడింది.

### స్వచ్ఛంద సంస్థలకు సహాయం

ఆంధ్రప్రాంతంలోని ఏజన్సీ భూములలో సంక్షేమ కార్యక్రమాన్ని కొనసాగిస్తున్న స్వచ్ఛంద సంస్థలకు ఆర్థిక సహాయాన్ని కలుగ చేసేటందుకు 1959-60లో రూ 0.90 లక్ష మొత్తం కేటాయించ బడింది. ఈ జిల్లాలోని స్వచ్ఛంద సంసలకు కూడా ఈ పథకం క్రింద లాభం చేకూరుతుంది.

# స్త్రీ సంక్షేమం

### వృత్తివిద్యా శిక్షణ కేంద్రాలు

తక్కువ తాబడిఉన్న వర్గపుకుటుంబాలకు చెందిన చదువుకున్నబాలికలకు ఉద్యోగాలనుచూపించేనిమిత్తం టైప్‌రైటింగు షార్టుహేండు, బుక్‌కీపింగు, అకౌంటెన్సీ సెక్రెటేరియల్ కోర్సులు వంటి సాంకేతిక కోర్సులు ఈజిల్లాలోని ఏలూరులో వున్న శిక్షణకేంద్రంలో నిర్వహింపబడుతున్నాయి. ఈ శిక్షణ కేంద్రం 1958-59లో ప్రారంభించ బడింది. 1959-60లో ఈ కేంద్రాన్ని కొనసాగించడానికి 30మంది లేదా అంతకుమించి ఎక్కువగా వచ్చినట్లయితే ఎక్కువ మందికి శిక్షణ ఇవ్వడానికి రూ 0.156 లక్ష మొత్తం కేటాయించ బడింది.

### ఇప్పటి స్త్రీ సంక్షేమ విభాగాల అభివృద్ధి

స్త్రీ సంక్షేమ శాఖ కార్యకలాపాలను తీవ్రతరం చేసి వాటిని ఇంకా ఉప

యోగకరంగా ఉండేటట్లు చేసే ఉద్దేశంతో దృశ్యశ్రవణ పరికరాలు, సౌండు ప్రొజెక్టరు, ఎడ్యుకేషనల్ చార్టులు, కెమెరాలు రేడియోలు. సైకిళ్ళు కుట్టు మిషన్లువంటి పరికరాలు, ముఖ్యమైన వస్తువులను 1959-60లో రూ 0.10 లక్షవ్యయంతో ఆంధ్రలో ప్రస్తుతంవున్న 12విభాగాలకు సరఫరా చేయడానికి తలపెట్ట బడింది. అ మొత్తంలో రూ. 900.లు ఈ జిల్లాకు కేటాయించబడినాయి

# సాంఘిక సంక్షేమం

## సాంఘిక సంక్షేమ విస్తరణ ప్రాజెక్టులు

ప్రస్తుతము ఉన్న 3సంక్షేమ ప్రాజెక్టులను నిర్వహించడానికి, ఈ జిల్లాలోని మొదటిదశ బ్లాకులలో కో ఆర్డినేటెడ్ పద్ధతిని మరొక ప్రాజెక్టు ప్రారంభించడానికి రాజ్య ప్రభుత్వ వాటాక్రింద ప్రణాళికలో ఈ సంవత్సరం రూ. 0.513 లక్ష మొత్తం కేటాయించ బడింది ఈ ప్రారంభించబోయే ప్రాజెక్టుకు అయ్యే ఖర్చును బ్లాకులు, కేంద్ర, సాంఘిక సంక్షేమబోర్డు రాజ్యప్ర త్వం 5:12:6 నిష్పత్తిలో భరిస్తాయి. ప్రజలనుంచి సేకరించే సూచింగు విరాళాలు కూడా ఇందుకు ఇవ్వ బడతాయి.

## సాంఘిక, నైతిక పునరుద్ధరణ, సంరక్షణ కార్యక్రమాలు

నైతిక పునరుద్ధరణ కేంద్రాలనుండి విడుదల చేయబడిన స్త్రీలకోసం ఒకప్రభుత్వ సదనాన్ని. 14జిల్లా ఆశ్రయ కేంద్రాలను, (3పురుషులకు 11స్త్రీ లకు) ప్రారం ంచడానికి అయ్యేఖర్చులో రాజ్యప్రభుత్వ వాటాక్రింద 1959-60 ప్రణాళికలో రూ. 6 82 లక్ష మొత్తం కేటాయించ బడింది. రాజ్యంలో ఇంతకుముందు ప్రారంభించిన ప్రభుత్వ సదనాలు, జిల్లా ఆశ్రయ కేంద్రాలు కూడా కొనసాగించ బడతాయి. పైకేటాయింపు మొత్తంలో రూ. 0.153 లక్ష మొత్తం ఈ జిల్లాలోని స్త్రీల జిల్లా ఆశ్రయ కేంద్రం కొనసాగించడానికి కేటా యించ బడింది.

## భిక్షుక గృహాలు

1959-60సంవత్సరంలో ఈ జిల్లాలో 60మంది బిచ్చగాండ్రకు వసతి

### ఏజెన్సీ ప్రాంతాలలో మంచి నీటిబావులు

ఏజన్సీ ప్రాంతాలలో మంచినీటి సౌకర్యాలు కొరతగా ఉన్నందున ఆదివాసులు వాగుల నీటిని, నిలవ ఉన్న నీటిని త్రాగుతు ఉంటారు. ఇది ఆరోగ్యానికి భంగకరం. వీరికి మంచినీటిని సరఫరా చేసేనిమిత్తం రూ 0.19 లక్షమొత్తం ఖర్చుతో ఈ జిల్లాలోని ఏజన్సీ ప్రాంతాలలో 5 బావులను త్రవ్వ డానికి ఉద్దేశింప బడింది.

### స్వచ్ఛంద సంస్థలకు సహాయం

ఆంధ్రప్రాంతంలోని ఏజన్సీ భూములలో సంక్షేమ కార్యక్రమాన్ని కొనసాగిస్తున్న స్వచ్ఛంద సంస్థలకు ఆర్థిక సహాయాన్ని కలుగ జేసేటందుకు 1959–60లో రూ 0.90 లక్ష మొత్తం కేటాయించ బడింది. ఈ జిల్లాలోని స్వచ్ఛంద సంసలకు కూడా ఈ పథకం క్రింద లాభం చేకూరుతుంది.

## స్త్రీ సంక్షేమం

### వృత్తివిద్యా శిక్షణ కేంద్రాలు

తక్కువ రాబడి ఉన్న వర్గపుకుటుంబాలకు చెందిన చదువుకున్న బాలికలకు ఉద్యోగాలనుచూపించేఃమిత్తం షైవ్ రైటింగు షార్టుహేండు, బుక్ కీపింగు, అక్కౌంటెన్సీ సెక్రెటేరియల్ కోర్సులు వంటి సాంకేతిక కోర్సులు ఈజిల్లాలోని ఏలూరులో వున్న శిక్షణకేంద్రంలో నిర్వహింప బడుతున్నాయి, ఈ శిక్షణ కేంద్రం 1958–59లో ప్రారంభించ బడింది. 1959–60లో ఈ కేంద్రాన్ని కొనసాగించడానికి 30మంది లేదా అంతకుమించి ఎక్కువగా వచ్చినట్లయితే ఎక్కువ మందికి శిక్షణ ఇవ్వడానికి రూ 0.156 లక్ష మొత్తం కేటాయించ బడింది.

### ఇప్పటి స్త్రీ సంక్షేమ విభాగాల అభివృద్ధి

స్త్రీ సంక్షేమ శాఖ కార్యక్రమాలను తీవ్రతరం చేసి వాటిని ఇంకా ఉప

యోగకరంగా ఉండేటట్లు చేసే ఉద్దేశంతో దృశ్యశ్రవణ పరికరాలు, సౌండు ప్రొజెక్టరు, ఎడ్యుకేషనల్ చార్టులు, కెమారాలు రేడియోలు. సైకిళ్ళు కుట్టు మిషన్లువంటి పరికరాలు, ముఖ్యమైన వస్తువులను 1959–60లో రూ 0.10 లక్షవ్యయంతో ఆంధ్రలో ప్రస్తుతంవున్న 12విభాగాలకు సరఫరా చేయడానికి తలపెట్ట బడింది. ఆ మొత్తంలో రూ. 900,లు ఈ జిల్లాకు కేటాయించబడినాయి

# సాంఘిక సంక్షేమం

## సాంఘిక సంక్షేమ విస్తరణ ప్రాజెక్టులు

ప్రస్తుతము ఉన్న 8సంక్షేమ ప్రాజెక్టులను నిర్వహించడానికి, ఈ జిల్లాలోని మొదటిదశ బ్లాకులలో కో ఆర్డినేటెడ్ పద్ధతిని మరొక ప్రాజెక్టు ప్రారంభించడానికి రాజ్య ప్రభుత్వ వాటాక్రింద ప్రణాళికలో ఈ సంవత్సరం రూ. 0.513 లక్ష మొత్తం కేటాయించ బడింది. ఈ ప్రారంభించబోయే ప్రాజెక్టుకు ఆయ్యే ఖర్చును బ్లాకులు, కేంద్ర, సాంఘిక సంక్షేమబోర్డు రాజ్య ప్ర త్వం 5:12:6 నిష్పత్తిలో భరిస్తాయి. ప్రజలనుంచి సేకరించే మాచింగు విరాళాలు కూడా ఇందుకు ఇవ్వ బడతాయి.

## సాంఘిక, నైతిక పునరుద్ధరణ, సంరక్షణ కార్యక్రమాలు

నైతిక పునరుద్ధరణ కేంద్రాలనుండి విడుదల చేయబడిన స్త్రీలకోసం ఒకప్రభుత్వ సదనాన్ని, 14జిల్లా ఆశ్రయ కేంద్రాలను, (3పురుషులకు 11స్త్రీ లకు) ప్రారం ంచడానికి ఆయ్యేఖర్చులో రాజ్యప్రభుత్వ వాటాక్రింద 1959–60 ప్రణాళికలో రూ. 6 82 లక్ష మొత్తం కేటాయించ బడింది. రాజ్యంలో ఇంతకుముందు ప్రారంభించిన ప్రభుత్వ సదనాలు, జిల్లా ఆశ్రయ కేంద్రాలు కూడా కొనసాగించ బడతాయి. పైకేటాయింపు మొత్తంలో రూ. 0.153 లక్ష మొత్తం ఈ జిల్లాలోని స్త్రీల జిల్లా ఆశ్రయ కేంద్రం కొనసాగించడానికి కేటా యించ బడింది.

## భిక్షుక గృహాలు

1959–60సంవత్సరంలో ఈ జిల్లాలో 60మంది బిచ్చగాండ్రకు వసతి

వుండే భిక్షుక గృహాన్ని స్థాపించడానికి ఉద్దేశింప బడింది, ఇందులో ప్రాథమిక విద్య గఱపబడుతుంది. చెప్పులుకుట్టడం, వ్రడ్రంగపుపని, నేతనేయడం కుట్టు పనిచేయడంవంటి హస్తకళలకు సంబంధించిన పనులలో శిక్షణ ఇవ్వబడుతుంది, ఇందులో భోజన సదుపాయం, వైద్యసౌకర్యాలు ఏర్పాటు చేయబడతాయి. దీనికిఖర్చు గ్రాంట్-ఇన్-ఎయిడ్ పథకంక్రింద రూ. 0.30లక్ష మొత్తం అవుతుం దని అంచనా వేయబడింది.

## మునిసిపలు రోడ్లు అభివృద్ధి పనులు

మునిసిపాలిటీల, రెండు పట్టణ పంచాయతీల ఆదాయమార్గాలను అభివృద్ధి పరచే ఉద్దేశంతోను ప్రజలకు మరికొన్ని సౌకర్యాలను కలగజేసే ఉద్దేశం తోను రెండవ ప్రణాళికలో రూ. 47.54 లక్షల మొత్తం కేటాయించబడింది. దీర్ఘకాలిక ఋణాల రూపంలో ఆర్థిక సహాయం కలుగజేయడానికి ఈ మొత్తం వినియో గింప బడుతుంది. అందులో రూ. 21.42 లక్షలు మొదటిమూడు సంవత్సరాలలో ఖర్చుచేయబడ్డాయి, ఈ సంవత్సరపు ప్రణాళికలో రూ. 11.59 లక్షల మొత్తం కేటాయించ బడింది. అందులో రూ. 0.15 లక్షమొత్తం 1959-60లో టౌను ప్లానింగు డైరెక్టరు కార్యాలయంలో నియమించ బడిన అదనపు సిబ్బందిని కొనసాగించడానికి వినియోగింప బడుతుంది. మిగిలిన రూ. 11.44 లక్షల లోను రూ. 1.55 లక్షల మొత్తం ఈ జిల్లాకు కేటాయించ బడింది. ఋణం మొత్తం స్థానిక సంస్థవేషు, పనివివరం ఈ దిగువ తెలుప బడ్డాయి.

| స్థానిక సంస్థపేరు | పనివివరం | ఋణంమొత్తం(రు.లక్షలలో) |
|---|---|---|
| పాలకొల్లు మునిసిపాలిటీ | కలువురోడ్లతోసహాబండ్లు, బస్సులు నిలవడానికి స్టాండులు | 0, 40 |
| భీమవరం ,, | మాతా, శిశు ఆరోగ్య కేంద్రాలు | 0.25 |
| ,, ,, | బస్సు స్టాండుకు అభివృద్ధి పనులు | 0. 10 |
| ,, ,, | మార్కెట్లలో కొట్ల నిర్మాణం | 0. 40 |
| నరసాపురం ,, | రోడ్లమీద దుమ్ము లేవ కుండా చేయడం | 0. 40 |
| | మొత్తం | 1.55 |

# రేడియో ప్రసారం.

## కమ్యూనిటి రేడియో సెట్ల స్థాపన, నిర్వహణ,

రెండవ ప్రణాళికాలో కాలంలో స్థాపించ దలచిన 415 కమ్యూనిటి రేడియో సెట్లలోను, 253 సెట్లు 1956–59 లో ఈజిల్లాలో స్థాపించ బడినాయి. ఈసంవత్సరంలో, 1-4- 1959కి పూర్వం స్థాపించ బడిన సెట్లు అన్నిటిని నిర్వహించడమే కాకుండా ఈజిల్లాలో 62 సెట్లను స్థాపించి నిర్వహించ

డానికి తలపెట్టబడింది. ఇందుకు ఈసంవత్సరపు ప్రణాళికలో రూ. 0.315 లక్ష మొత్తం కేటాయింప బడింది.

# ప్రచారం

అభివృద్ధి కార్యకలాపాలనుగురించి అనేక సాధనాలద్వారా ఏకీకృతప్రచార కార్యక్రమం 1956-57 లో ప్రారంభించ బడింది. ప్రజలలో ఉత్సాహాన్ని రేకెత్తించడానికి, రెండవ ప్రణాళిక విజయవంతంగా అమలు పరచడంకోసం వారి సంపూర్ణ సహకారాన్ని అభ్యర్థించడానికి ఈకార్యక్రమం ఉద్దేశింప బడింది. ఈ కార్య క్రమాన్ని కొనసాగించడానికి ఈసంవత్సరపు ప్రణాళికలో రూ. 6.80 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఇందులో రూ. 44, 877 లు ఈజిల్లాలో ఈ క్రింది వాటికోసం వినియోగింప బడతాయి.

| | | రూపాయిలు |
|---|---|---|
| 1 | పి. ఏ. ల. జీతబత్తాలు ఇతర సిబ్బంది జీత బత్తాలు | 5,987 |
| 2 | ప్రచారవ్యానులకు పెట్రోలు ఖర్చులు నిర్వహణ ఖర్చులు | 1,200 |
| 3 | జిల్లాస్థాయిలో ఏర్పాటు చేయ బడే ప్రదర్శనలో పాల్గొనడం. | 250 |
| 4 | సంగీతకచ్చేరీలు, నాటకోత్సవాలు నిర్వహించడం | 500 |
| 5 | జిల్లా, తాలూకా స్థాయిలలో ప్రచారసప్తాహాలను జరపడం. | 900 |
| 6 | ఈ జిల్లాలో ప్రచారం చేస్తున్న బుర్రకథదళాల నిర్వహణ. | 2,280 |
| 7 | ప్రస్తుతమున్న పబ్లిక గ్రంథాలయాలలో పైలెటు పద్ధతిని సమాచార కేంద్రాలను నిర్వహించడం. | 960 |
| 8 | మొబైల్ వ్యానులకు కేటాయింపు. | 32,800 |
| | మొత్తం | 44,877 |

## అర్థ గణాంక శాఖ

జిల్లా స్థాయిలో రాజ్య ప్రభుత్వానికి చెందిన గణాంక కార్యకలాపాలను సమన్వయ పరచి, సేకరించే వివరాల స్థాయిని అభివృద్ధి పరచడానికి 1959–60 లో ఒక జిల్లా గణాంక సంస్థ ఈ జిల్లాలో నెలకొల్ప బడుతుంది. ఒక జిల్లా గణాంకాధికారి (గెజిటెడ్), ఒక ఎకనామిక్ ఇన్వెస్టిగేటరు, ఒక అప్పరు డివిజను గుమాస్తా, ఇద్దరు జవాన్లు ఇందులో నియమించ బడతారు. ఇందుకు 1959–60 ప్రణాళికలో రూ. 0.10 లక్ష మొత్తం కేటాయించ బడింది.

---

## తంతి తపాలా సౌకర్యాలు

1959–60లో 2 తంతి (సంయుక్త) కార్యాలయాలను దొడ్డిపట్ల కొయ్యలగూడెంలలో ప్రారంభించడమే కాక, 71 తపాలా ఆఫీసులను ప్రారంభించడానికి కూడా తలపెట్ట బడింది. భీమడోలులో ఒక టెలిఫోను ఎక్స్ఛేంజీని, పోలవరం, వేగేశ్వర పురం, చింతలపూడి, రేలంగి, ఉండిలలో 4 పబ్లిక్ కాల్ ఆఫీసులను కూడా ప్రారంభించడానికి తలపెట్ట బడింది.

---

## రైలుమార్గాలు

1959–60లో పశ్చిమ గోదావరి జిల్లాలో అమలు జరుపబడే రైలుమార్గాల కార్యక్రమం ఈ దిగువ తెలుప బడింది.

| వరుస సంఖ్య | పనివివరం | అంచనా వేయబడ్డ ఖర్చు వేలరూపాయలలో |
|---|---|---|
| 1. | విజయవాడ—వాల్తేరు సెక్షను, లైను కెపాసిటీ పనులు | |
| | (i) నవాబు పాలెం—లూప్ లైనును 70 బండ్లునిలువ డానికి వీలుగా పొడిగించటం | 172 |
| | (ii) బాదం పూడి— ,, | |
| | (iii) చాగల్లు— ,, | |
| 2. | నిడదవోలు, నర్సాపురంల మధ్య 377/18–19 నుండి 392/20వరకు 14 మైళ్లు ప్రస్తుతం వున్న 75 పౌన్లుఆర్ '' క్రొత్త ఉడన్ స్లీపర్లతో మొత్తం రైలుబాటను పునర్నిర్మించటం. | 2051 |
| 3. | ఈ శాన్య లైను—విజయవాడ మచిలీపట్నం సెక్షను గుడివాడ భీమవరం—విజయవాడ—మచిలీపట్నం—మీటరుగేజి నుండి బ్రాడ్ గేజికి మార్చడం—2వ దశ విజయవాడ—మచిలీపట్నం సెక్షన్ ప్రస్తుతం వున్న పొడవు 49.25 మైళ్ళను మార్చడం (మార్పు చేయ బడే పొడవు 54.25 మైళ్ళు). | 29500 |

## పశ్చిమ గోదావరి జిల్లా, జిల్లా ప్రణాళికా అభివృద్ధి సంఘంసభ్యుల జాబితా

1. కలెక్టరు — అధ్యక్షుడు,
2. శ్రీ వీర మాచినేని వెంకటనారాయణ — ఉపాధ్యక్షుడు.
3. జిలా ప్లానింగు ఆఫీసరు — పదవీరీత్యా కార్యదర్శి

### అధికార సభ్యులు

1. ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు, గోదావరి పశ్చిమ డివిజను, నిడదవోలు.

2. ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు, గోదావరి స్పెషల్ డివిజను, ఏలూరు.
3. ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు, కృష్ణా తూర్పు డివిజను, విజయవాడ.
4. జిల్లా వ్యవసాయశాఖాధికారి, పశ్చిమగోదావరి, ఏలూరు.
5. అదనపు జిల్లా వ్యవసాయ శాఖాధికారి, పశ్చిమ గోదావరి, ఏలూరు
6. వ్యవసాయశాఖ డిప్యూటీ డైరెక్టరు, ఏలూరు.
7. సహకార సంఘాల డిప్యూటీ రిజిస్ట్రారు, ఏలూరు
8. సహకార సంఘాల డిప్యూటీ రిజిస్ట్రారు, భీమవరం
9. జిల్లా వైద్యశాఖాధికారి, పశ్చిమ గోదావరి, ఏలూరు
10. జిల్లా పశువైద్య శాఖాధికారి, పశ్చిమ గోదావరి, ఏలూరు
11. ఏజెన్సీ అభివృద్ధి స్పెషల్ జిల్లా పశువైద్య శాఖాధికారి
12. జిల్లా ఆరోగ్య శాఖాధికారి, పశ్చిమ గోదావరి, ఏలూరు
13. రహదార్ల డివిజనలు ఇంజనీరు, ఏలూరు
14. విద్యుచ్ఛక్తి డివిజనలు ఇంజనీరు, ఏలూరు
15. విద్యుచ్ఛక్తి డివిజనలు ఇంజనీరు, రాజమండ్రి
16. జిల్లా విద్యా శాఖాధికారి, పశ్చిమ గోదావరి, ఏలూరు
17. జిల్లా పంచాయతీ ఆఫీసరు, పశ్చిమ గోదావరి, ఏలూరు
18. పోలీసు సూపరింటెండెంటు, పశ్చిమ గోదావరి, ఏలూరు
19. జిల్లా అటవీ శాఖాధికారి, కాకినాడ.
20. ప్లానింగు అసిస్టెంటు ఇంజనీరు, ఏలూరు
21. జిల్లా గోస్తు స్పెషల్ ఆఫీసరు, పి.ఐ. పశ్చిమ గోదావరి, ఏలూరు
22. పరిశ్రమలు, వాణిజ్యశాఖ అసిస్టెంటు డైరెక్టరు,ఏలూరు
23. మత్స్య సంవర్ధన అసిస్టెంటు డైరెక్టరు, రాజమండ్రి
24. అసిస్టెంటు రేడియో ఇంజనీరు, ఏలూరు
25. అసిస్టెంటు రేడియో ఇంజనీరు, రాజమండ్రి
26. అసిస్టెంటు స్త్రీ సంక్షేమాధికారి, ఏలూరు
27. సబ్ కలెక్టరు, నరసాపురం

28. రెవిన్యూ డివిజనల్ ఆఫీసరు, ఏలూరు
29. రెవిన్యూ డివిజనలు ఆఫీసరు, కొవ్వూరు.
30. జిల్లా సంక్షేమాధికారి, ఏలూరు
31. అదనపు జిల్లా పంచాయతీ ఆఫీసరు, భీమవరం
32. బ్లాకు డెవలప్‌మెంటు ఆఫీసరు, భీమడోలు
33. బ్లాకు డెవలప్‌మెంటు ఆఫీసరు, దెందులూరు
34. బ్లాకు డెవలప్‌మెంటు ఆఫీసరు, చింతలపూడి
35. బ్లాకు డెవలప్‌మెంటు ఆఫీసరు, కొయ్యలగూడెం
36. బ్లాకు డెవలప్‌మెంటు ఆఫీసరు, కొవ్వూరు
37. బ్లాకు డెవలప్‌మెంటు ఆఫీసరు, గోపాలపురం
38. బ్లాకు డెవలప్‌మెంటు ఆఫీసరు, తాడేపల్లిగూడెం
39. బ్లాకు డెవలప్‌మెంటు ఆఫీసరు, పెంటపాడు
40. బ్లాకు డెవలప్‌మెంటు ఆఫీసరు, గణపవరం
41. బ్లాకు డెవలప్‌మెంటు ఆఫీసరు, ఆకివీడు
42. బ్లాకు డెవలప్‌మెంటు ఆఫీసరు, మొగల్తూరు
43. బ్లాకు డెవలప్‌మెంటు ఆఫీసరు, నిడదవోలు
44. బ్లాకు డెవలప్‌మెంటు ఆఫీసరు, బుట్టాయగూడెం
45. బ్లాకు డెవలప్‌మెంటు ఆఫీసరు, పోలవరం
46. బ్లాకు డెవలప్‌మెంటు ఆఫీసరు, అత్తిలి
47. బ్లాకు డెవలప్‌మెంటు ఆఫీసరు, పెదపాడు

---

అనధికార సభ్యులు

(లోకసభ సభ్యులు)

1. శ్రీ ఉద్దరాజు రామం, ఎం. పి. నరసాపురం,
2. కుమారి మోతే వేదకుమారి, ఎం. ఎ. ఎం. పి. ఏలూరు.

రాజ్యసభ సభ్యులు

1. శ్రీ అల్లూరి సత్యనారాయణ రాజు ఎం. పి. జిన్నూరు పోస్టు, నరసాపురం తాలూకా,

2. శ్రీమతి డి. యశోదారెడ్డి, ఎం. పి. ఏలూరు.

విధాన సభసభ్యులు

1. శ్రీ తెన్నేటి వీరరాఘవులు, ఎ. ఎల్. ఎ. కొవ్వూరు.
2. శ్రీ అల్లూరి బాపినీడు, ఎం. ఎల్. ఎ. కొవ్వూరు.
3. శ్రీ పుసులూరి కోదండ రామయ్య ఎం. ఎల్. ఎ పోలవరం.
4. శ్రీ శీర్ల బ్రహ్మయ్య, ఎం. ఎల్. ఎ. ఏలూరు.
5. శ్రీ మూల్పూరి రంగయ్య, ఎం. ఎల్. ఎ. ఏలూరు.
6. శ్రీ నంబూరి శ్రీనివాసరావు ఎం. ఎల్. ఎ.
7. శ్రీమాన్ కిళాంబి వెంకట కృష్ణావతారం, ఎం. ఎల్. ఎ. ఏలూరు.
8. శ్రీ సి. హెచ్. ఎస్. ఆర్. సి. హెచ్ వి. పి. మూర్తిరావు ఎం. ఎల్. ఎ. చినినింద్ర కోలను, తాడేపల్లి గూడెం తాలూకా.
9. శ్రీ ముళ్ళపూడి హరిశ్చంద్ర ప్రసాద్, ఎం. ఎల్. ఎ. తణుకు.
10. శ్రీమతి చొడగం అమ్మన్నరాజా, ఎం. ఎల్. ఎ.
11. శ్రీ జవ్వాడి లక్ష్మయ్య, ఎం. ఎల్. ఎ. పెనుగొండ.
12. శ్రీ గ్రంధి వెంకటరెడ్డి, బి. ఎ. బి. ఎల్. ఎం. ఎల్. ఎ. నరసాపురం, (న్యాయశాఖ మంత్రి).
13. శ్రీ దాసరి పెరుమాళ్లు, ఎం. ఎల్. ఎ. పాలకొల్లు.
14. శ్రీ అద్దేపల్లి సత్యనారాయణమూర్తి, ఎం. ఎల్. ఎ. పాలకొల్లు.
15. శ్రీ నాచు వెంకటరామయ్య, ఎం. ఎల్. ఎ. భీమవరం
16. శ్రీ గుడిరాజు జగన్నాథరాజు, ఎం. ఎల్. ఎ. భీమవరం.

## విధాన పరిషత్తు సభ్యులు

1. శ్రీ తుమ్మలపల్లి వీరభద్రరావు. ఎం. ఎల్. సి. పిప్పర వయా వెంటపా, పశ్చిమ గోదావరి జిల్లా.
2. శ్రీ శంకు అప్పారావు. ఎం. ఎల్. సి. జిల్లా కమ్యూనిస్టు పార్టీ కార్యాలయం. అగ్రహారం, ఏలూరు.
3. శ్రీమతి ద్రోణంరాజు లక్ష్మీ బాయమ్మ, ఎం. ఎల్. సి. భీమవరం.
4. శ్రీ దేశిరాజు సత్య సుబ్రహ్మణ్యం. ఎం. ఎల్. సి. ప్రిన్సిపల్, సర్ సి. ఆర్. రెడ్డి కళాశాల, ఏలూరు.

### అనధికార సభ్యులు

1. మున్సిపల్ కౌన్సిలు చైర్మను, ఏలూరు
2. మున్సిపల్ కౌన్సిలు చైర్మను, పాలకొల్లు
3. మున్సిపల్ కౌన్సిలు చైర్మను, భీమవరం
4. తుమ్మలపల్లి సత్యనారాయణమూర్తి పిప్పర. (పంచాయతీల ప్రతినిధి)
5 తాడేపల్లి రామస్వామి తాడేపల్లిగూడెం, మున్సిపల్టీల ప్రతినిధి.
6. శ్రీ రాయుడు గంగయ్య. ఏలూరు, (హరిజన సేవక సమాజం సభ్యులు)
7. శ్రీ పిరమాచినేని వెంకట నారాయణ. (హరిజన సేవక సమాజం జిల్లా కన్వీనరు)
8. శ్రీమతి పి. రమాదేవి, పోలవరం, కస్తూరిబా ట్రస్టు స్త్రీ ప్రతినిధి,
9. శ్రీ ఎం. శేషగిరిరావు, ఆకివీడు,
10. శ్రీ పి. బి. రంగాచార్యులు, పోలవరం,
11. శ్రీ ఐ. పాపారావు, భోగోలు.
12. శ్రీ జి. గంగరాజు. పాలకొల్లు.
13. శ్రీ కె. సీతారామయ్య. కాగుపాడు. తాడేపల్లి గూడెం తాలూకా.
14. శ్రీ జి. రఘునాయకులు. చిన్నాయగూడెం.
15. శ్రీ వి. పార్థసారథి. ముల్కి మహమ్మద్ పురం. (భీమడోలు బ్లాకు ప్రతినిధి)

16. శ్రీ సేవం చిన బుచ్చెం దొర. కొండ్రుకోట, పోలవరం తాలూకా (కొయ్యలగూడెం బ్లాకు ప్రతినిధి)

17. శ్రీ జి. విష్ణుమూర్తి, చింతలపూడి. (చింతలపూడిబ్లాకు ప్రతినిధి)

18. శ్రీ జి. వెంకట సుబ్బరాజు, మండలపర్రు (గణపవరం బ్లాకు ప్రతినిధి)

19. శ్రీ మాగంట బాపినీడు, రీజినల్ ఆఫీసరు, భారత సేవక సమాజం. మద్రాసు.

20. శ్రీ భూపాతిరాజు గోపరాజు, జిన్నూరు, నరసాపురం తాలూకా

21. శ్రీ చిల్ల గంగభూపతి వేమవరం, నరసాపురం తాలూకా.

22. శ్రీమతి టి. జి. హైమవతి, ఏలూరు,

23. శ్రీ వై. సూర్యనారాయణ, తణుకు

24. శ్రీ మన్నే బుల్లి తిరుపతి రాయుడు, దేవ, నరసాపురం తాలూకా

